Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)
స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు స్థాపితం: 1930 జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి
*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 50 • 7-12-2012 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-







## తాత పోతే బొంత నాది!

రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి అనారోగ్యంతో ఆస్పత్రిలో చేరడంతో ఆ స్థానంలో కాంగ్రెస్ నాయకత్వం కోసం ఆయన ఇంట్లో అప్పుడే పోటీ తలెత్తుతున్నది. తన తండ్రి వారసత్వంగా రాజకీయాలలోకి రావడానికి వివేకా పెద్ద కుమారుడు ఎసి సుబ్బారెడ్డి సన్నద్ధుడౌతున్నట్లు వినికిడి. తండ్రి వలెనే తాను కూడా మొదటగా రంగనాయకుల స్వామి దేవస్థానం ఛైర్మన్ పదవితో రాజకీయ ఆరంగేట్రం చేయాలని ప్రయత్నిస్తున్నాడట. అయితే తన తండ్రి నెల్లూరు నగరంలో కాంగ్రెస్ పార్టీని ఒక స్మశానంగా మార్చి వున్నాడన్న నిజం ఆ పిల్లవాడికి తెలిసినట్లు లేదు పాపం. రూరల్ స్థానం కోసం ఎప్పటి నుంచో ఆనం విజయకుమార్‌రెడ్డి ఆశ పడుతున్న విషయం అందరికీ తెలిసిందే. ఈసారి తన అన్నను ఎమ్పీ స్థానానికి పోటీకి నిలిపి, రూరల్‌లో తాను నిలవాలని విజయకుమార్‌రెడ్డి చాలాకాలం నుంచి ప్రయత్నిస్తున్నాడు. ఇప్పుడు ఇంట్లో నుంచే పోటీ వచ్చింది. ఈ సమస్యను రామనారాయణరెడ్డి ఎట్లా పరిష్కరిస్తాడో వేచి చూడాలి. ఇదిట్లా వుంటే, వివేకా మనసును మైమరపిస్తున్న మహిళా నేతకూ ఎమ్మెల్యే సీటు మీద మోజు వుంది. వివేకా మాట చెల్లుబాటు అంటూ జరిగితే ఇంట్లోని వారికంటే ఆమెకే ప్రాధాన్యత ఇస్తాడన్నది నిజం.

● శాసనసభ సాక్షిగా బయటపడ్డ

# వైకాపా రాజకీయ అనుభవరాహిత్యం!

రాజకీయ చతురత, పార్లమెంటరీ అనుభవం, వ్యూహ రచనా నైపుణ్యం లేకుంటే పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో ఎటువంటి సమస్యలు తలెత్తుతాయో ఇప్పటి శాసనసభ సమావేశాలు రుజువు చేశాయి. ఎస్సీ ఉప ప్రణాళికను చట్టబద్ధం చేయడం కోసం జరిగిన సమావేశం ఇది. షెడ్యూల్ కులాలకు చెందినవారి కోసం బడ్జెట్‌లో కేటాయించే నిధులను ఇతర పథకాలకు మళ్లించకుండా నియంత్రించడం కోసం చేస్తున్న చట్టం ఇది. దేశంలో ఇప్పటి వరకు ఈ తరహా చట్టం లేదు. రాజ్యాంగ నిర్మాత బిఆర్ అంబేద్కర్ పుణ్యాన అని ఎస్సీ, ఎస్టీ వర్గాల వారికి ప్రభుత్వ ఖర్చులో నిర్ణీత కోటా ఏర్పడే సాంప్రదాయం ఏర్పడిన సంగతి అందరికీ తెలిసిందే. తరతరాలుగా, యుగ యుగాలుగా సామాజికంగా, ఆర్థికంగా అణగదొక్కబడిన కులాల వారికి సామాజిక న్యాయం కల్పించడానికి ప్రభుత్వాలు చిత్తశుద్ధితో కృషి చేయాలని అంబేద్కర్ ఆశించాడు. అయితే ఎస్సీల కంటి తుడుపుగా బడ్జెట్‌లో వారి కోసం కేటాయింపు జరపడం, ఆ తర్వాత వాటిని ఇతర అవసరాలకు మళ్లించుకోవడం ప్రభుత్వాలకు అలవాటైపోయింది. దీని వల్ల ఎస్సీ, ఎస్టీ వర్గాల అభివృద్ధి మందగిస్తున్నది. ఈ లోపాన్ని సరి చేయడానికి బడ్జెట్‌లో ఒక ఉప బడ్జెట్‌గా ఎస్సీలకు నిధుల కేటాయింపు జరగాలని ఉప ముఖ్యమంత్రి దామోదర రాజనర్సింహ తలపెట్టాడు. అందుకు ముఖ్యమంత్రి కూడా అంగీకారం తెలపడంతో దానికి చట్టబద్ధత వచ్చింది. అయితే జగన్ పార్టీకి చేరువగా వెళ్లిన ఎస్సీలను తమవైపు ఆకర్షించుకోవాలనే రాజకీయ లక్ష్యం తప్ప నిజమైన ఎస్సీ అభ్యున్నతి ఉద్దేశం ఈ చట్టంలో కన్పించడం లేదు. ఉప ప్రణాళిక చట్టం ప్రకారం భవిష్యత్తులో వచ్చే ప్రభుత్వాలు ఎస్సీలకు కేటాయించిన నిధులను ఖర్చు పెట్టకుంటే ఎవరిని బాధ్యులను చేయాలి, ఆ తప్పుకు పరిహారం ఏమిటి అన్న స్పష్టత ఈ చట్టంలో లేదు. దానివల్ల భవిష్యత్తులో కూడా ప్రభుత్వాలు ఎస్సీ నిధులను ఇతర పథకాలకు మళ్లిస్తే చేయగల్గింది పెద్దగా కన్పించడం లేదు.

అదటుంచి ఈ చట్టం ఆమోదం కోసం జరిగిన శాసనసభ సమావేశంలో వైఎస్‌జగన్ పార్టీ తన రాజకీయ అనుభవ రాహిత్యాన్ని బయట పెట్టుకొన్నది.

ఎస్సీ ఉప ప్రణాళిక చట్టంలో వర్గీకరణ సూత్రం

కొరవ 14వ పేజీలో















# పంతం నెగ్గించుకొన్న ప్రధాని!

చిల్లర అంగళ్లలో విదేశీ పెట్టుబడులను అనుమతించాలన్న పట్టుదల నెగ్గించుకొన్నాడు ప్రధాన మంత్రి మన్మోహన్‌సింగ్. 5తేదీ లోక్‌సభలో జరిగిన ఓటింగ్‌లో చావు తప్పి కన్ను లొట్టబోయినట్లు గెలిచానన్పించాడు. ఒక విధాన నిర్ణయం మీద లోక్‌సభలో ఓటింగ్ జరగడం అసాధారణమైన విషయం. విధానాల రూపకల్పన ప్రభుత్వాల హక్కు, దానికి లోక్‌సభ ఆమోదం అవసరం లేదు. అయితే ఇది సాధారణ నిర్ణయం కాదు. దాదాపు నాలుగు కోట్ల మంది చిల్లర అంగళ్ల యజమానులు, చిన్న పరిశ్రమల కార్మికుల జీవితాలతో ముడిపడిన సమస్య. అందువల్లనే ప్రతిపక్షాలు చివరి వరకు ఈ విధాన నిర్ణయాన్ని అడ్డుకోవడానికి తమ శక్తి యుక్తులన్నిటినీ వినియోగించాయి. రాజకీయంగా, సిద్ధాంతపరంగా బద్ధ శత్రువులైన బిజెపి – కమ్యూనిస్టులు, ములాయం – మాయవతి, సిపిఎం – మమతా బెనర్జీ ఏక త్రాటిమీదకు వచ్చి, ఒకే తీరులో తమ ఓట్లు వేయడంలోనే ఇది ఎంత ప్రాధాన్యత కల్గిన అంశమో చెప్పకనే చెప్తున్నది.

చిల్లర అంగళ్లలో విదేశీ పెట్టుబడులను అనుమతిస్తే అటు వ్యవసాయ రంగంలో, ఇటు రిటైల్ రంగంలో పెద్ద ఎత్తున పెట్టుబడులు తరలి వస్తాయని, దాని ద్వారా అభివృద్ధిలో ఏర్పడిన మంద గమనాన్ని అధిగమించవచ్చునని ప్రధాన మంత్రి వాదిస్తున్నాడు. వాల్‌మార్ట్ వంటి చిల్లర అంగళ్ల వ్యాపార సంస్థలు రైతుల నుంచి నేరుగా వ్యవసాయ ఉత్పత్తులను కొనుగోలు చేస్తాయని, మార్కెట్‌లో ఏ ఉత్పత్తికి గిరాకీ వుందో ముందుగానే అంచనా వేసి వాటి సాగును ప్రోత్సహిస్తాయని, వ్యవసాయ ఉత్పత్తులను నిల్వ చేయడానికి శీతల గిడ్డంగులు నిర్మిస్తారని, రవాణాకు ఆధునిక ఏర్పాట్లు చేస్తారని, అందువల్ల రైతులకు దీనివల్ల ఎన్నో లాభాలు సిద్ధిస్తాయంటున్నాడు ప్రధాని.

అయితే నాణానికి ఇది ఒక భాగం మాత్రమే. వాల్‌మార్ట్ వంటి సంస్థలు తమకవసరమైన పంటల విషయంలో మాత్రమే ప్రోత్సాహం ఇస్తాయి. అందుకోసం అధిక దిగుబడి రకాల పేరిట జన్యు మార్పిడి విత్తనాలను తప్పని సరి చేస్తాయి. వాటిని అమ్ముకునే విదేశీ సంస్థలు వేల కోట్ల రూపాయల లాభాలు ఆర్జిస్తాయి. కానీ రైతు మాత్రం తీవ్రమైన ఆర్థిక ప్రమాదంలో చిక్కుకపోతాడు. వాన, వరద, కరవు, తెగులు వంటి ఏ కారణం వల్ల పంట నష్టం జరిగినా తిరిగి కోలుకోలేని రీతిలో వుంటుంది ఆర్థిక నష్టం. దాన్ని వాల్‌మార్ట్ పూడ్చదు. సాంప్రదాయక వ్యవసాయంలో విత్తనాల ఖర్చు తక్కువ కాబట్టి, విత్తనాలను తనే తయారు చేసుకొంటాడు కాబట్టి రైతుకు పంట నష్టం జరిగినా మళ్లీ పంట వేసుకొనే స్థోమత వుంటుంది. జన్యు మార్పిడిలో ఆర్థిక భారం అధికం.

ఇక చైనా నుంచి తెచ్చి అమ్మే పలు రకాల వస్తువులతో పోటీ పడలేక మన దేశంలోని చిన్న పరిశ్రమలు చతికిల పడడం ఖాయం. వాటి మీద ఆధారపడిన కోట్లాది మంది జీవితాలు వీధుల పాలు కావడమూ నిజం. చైనాతో పోటీకి పెద్ద పెద్ద సంస్థలే వెనుకంజ వేస్తున్నాయి. చైనాలో వడ్డీ రేటు కేవలం రెండు శాతం. మన దేశంలో కనీసం 18 శాతం. చైనాలో కరెంట్ చార్జీ యూనిట్‌కు మూడు రూపాయలు మించదు. మన పరిశ్రమలు యూనిట్‌కు 7 రూపాయలు చెల్లించాలి. అక్కడ ప్రభుత్వ ప్రోత్సాహాలు అధికం. ఇక్కడ ప్రభుత్వ అధికారుల వేధింపులు అధికం.

వాల్‌మార్ట్ వల్ల మొదటగా ప్రభావితమయ్యేది – వీధి చివర వుండే కిరాణా వర్తకుడు. వాల్‌మార్ట్ భారీ స్థాయిలో కొనుగోళ్లు జరుపుతుంది కాబట్టి, ధర తక్కువగా వుంటుంది. చింతాల్ సబ్బు ఎమ్ఆర్‌పి 10 రూపాయలను కొంటే, చిల్లర వర్తకుడికి 8 రూపాయల ధరలో సరఫరా చేస్తుంది కంపెనీ. కానీ వాల్‌మార్ట్ వంటి సంస్థలకు 4 నుంచి 5 రూపాయలకే ఇస్తుంది. ఆ ధరతో కిరాణా వర్తకుడు ఎప్పటికీ పోటీ పడలేడు. టెలివిజన్ల వంటి ఖరీదైన వస్తువుల నుంచి కాలి చెప్పుల వరకు ఇదే సమస్య తప్పదు.

ఇన్ని సమస్యలున్న కీలక ఆర్థిక విధాన నిర్ణయంలో ప్రధాని మన్మోహన్‌సింగ్ అంత తొందర పడడం ఎందుకో అర్థమే కాదు. నిజానికి దీనిపై జరిగిన ఓటింగ్‌లో కేంద్ర ప్రభుత్వం నైతికంగా ఓడి పోయింది. లోక్‌సభలో మెజార్టీకి కావాల్సింది 273 ఓట్లు. కానీ వచ్చింది మాత్రం 253 మాత్రమే. అంటే కేంద్ర సర్కారు మైనార్టీలో పడిందని రుజువన్న మాట. అయితే ములాయం సింగ్, మాయావతులు తమ తమ అవసరాల కోసం ఓటింగ్ బహిష్కరించడంతో సర్కారు చావు తప్పి కన్ను లొట్టపోయినట్లు బయటపడింది.

## జనవాణి

### హర్షణీయం

రాష్ట్రంలో లక్షలాది పేద ప్రజలను నట్టేట ముంచిన వివిధ మనీ స్కీం నిర్వాహకుల అరెస్టు, డబ్బు, ఆస్తుల రికవరీ, కొందరు ముఖ్య ఏజెంట్లను చూసీ చూడనట్లు వదలి, ఇంకొందరిని వేధించి కోట్లాదిరూపాయలు దిగమింగిన సిబిసిఐడి నెల్లూరు డిఎస్పీ విజయకుమార్‌పై డిజిపి దినేష్‌రెడ్డి విచారణకు ఆదేశించడం హర్షణీయం. దీనికిగాను మోసపోయిన లక్షలాదిమంది నిరుపేదల తరపున హృదయపూర్వక కృతజ్ఞతలు. మనీస్కీమ్‌ల దర్యాప్తు బాధ్యత స్వీకరించే సిట్ బృందం నిష్పక్షపాతంగా దర్యాప్తును కొనసాగించి పేదలకు న్యాయం చేసి రికవరీ చేసిన డబ్బును, జప్తు చేసిన ఆస్తులను త్వరితగతిన పేదలకు పంపిణీ చేసేలా దినేష్‌రెడ్డి చర్యలు తీసుకోమనవి.

*మందా బాబ్జీ* — నెల్లూరు

### పాదయాత్రల కాలం!

రాష్ట్రంలో పాదయాత్రల సీజను మొదలయ్యింది. దరిదాపులు అన్ని పార్టీల చిన్నా పెద్దనాయకులు పాదయాత్రలు మొదలు పెట్టారు. తాము అధికారంలోకి వస్తే అవి చేస్తాం; ఇది చేస్తామంటూ వాగ్దానాల పరంపర మొదలు పెట్టారు. ఎప్పుడూ లేనివిధంగా రాష్ట్ర ప్రజలు సైతం ప్రస్తుతం ఎన్నో సమస్యలతో సతమతమవుతున్నారు. బహిరంగ మార్కెట్‌లో బియ్యం రేట్లతోపాటు నిత్యావసరాలు, కూరగాయల రేట్లు పెచ్చు పెరిగాయి. కరెంట్ ఛార్జీలు పెంచుకొంటూ పోతున్నారు. ప్రభుత్వం సేవా ఛార్జీలంటూ బాదేస్తుంది. ఆర్టీసీ ఛార్జీలు పెరిగిపోతున్నాయి. రైతుకు గిట్టుబాటు ధర లేదు. పాదయాత్రల బదులు నేతలు ప్రజాసమస్యల పరిష్కారానికి చిత్తశుద్ధి ప్రయత్నం చేయమనవి.

*కె.పెంచలయ్య* — కొడవలూరు

### ఉద్యోగుల సమస్యలు పరిష్కరించాలి!

ఉద్యోగ, ఉపాధ్యాయ, కార్మిక మరియు పెన్షనర్ల ఐక్య కార్యాచరణ కమిటీ ఇచ్చిన రాష్ట్రవ్యాప్త ఆందోళన కార్యక్రమానికి జిల్లా రెవెన్యూ సర్వీస్ అసోసియేషన్ అడహాక్ కమిటీ మద్దతు ప్రకటిస్తుంది. రాష్ట్ర ప్రభుత్వం తక్షణమే 10వ వేతన సవరణ సంఘం నియామకం చేయాలి. రాష్ట్రప్రభుత్వ ఉద్యోగులందరికీ హెల్త్ కార్డులివ్వాలి. అన్ని కేటగిరీలలో ఉన్న ఖాళీలను వెంటనే భర్తీ చేయాలి. కాంట్రాక్టు ఉద్యోగులను పర్మినెంట్ చేయాలి. నూతన పెన్షన్ విధానం నిలుపుదల చేయాలి. గ్రామసేవకుల కనీసవేతనం ఆరువేలుగా నిర్ణయించాలి.

*షేక్. షఫీమాలిక్* — నెల్లూరు

### సంతోషంగా ఉంది!

వచ్చే యేడాది నెల్లూరులో ప్రభుత్వ మెడికల్ కాలేజి ప్రారంభిస్తున్నారన్న

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

**9-12-1942**
**పేజీలు : 10 వెల: అణా**

### నెల్లూరు ముచ్చట్లు

### నామినేషన్లు

ఊహాగానం :– మున్సిపాల్టీ – జిల్లా బోర్డుల నామినేషన్లు రేపోమాపో దూకబోతున్నవి.

టౌన్‌లో హిందూ మహాసభ కాంగ్రేసు ఉచ్చిష్టమని కాబోలు పెదవి విరిచిందట. వృద్ధవిత అన్నదేవుల రెడ్డి లొట్టలు వేసి ఓం శ్వాంతిః అని గ్రబ్బులోనే సరిపెట్టుకున్నాడు అందనందున. ఇక పెండ్లి కొడుకెవరయా అంటే ఒక మాటు ఈ మునిసిపల్ ఉచ్చిష్ట గణపతిని పూజించి మధ్యలోనే ఆయమృత రసాన్ని పొట్టమీద దొర్లించుకొని అకస్మాత్తుగా సపత్నీకంగా ఇంగ్లండుకెళ్లి తదీయ పుణ్యక్షేత్రాలను దర్శించి వచ్చిన రేబాల వంశాంకురం లక్ష్మీనరసారెడ్డి గారు అనుభవించి ఉమిసిన తమ్ముపై అక్రమ వాంఛ – ఇక జిల్లా బోర్డు ప్రెసిడెంటుగిరి? కష్టపడి సంపాయించుకున్న మన గోయిందన్నదే!

కడపలో మాదిరి యభాగ్యవతుల పోట్లాట యిక్కడుండదు లేండి.

కానీ పాపం! ఇక జీతం భత్యంలేని కొలువు – తెద్దునాకి వ్రతం జెరుచుకోవడమంటారు. దీన్ని ఇంగ్లీషు పండితులు–

"కాపట్యమన్నన్ తదీయులలోనైనను లేదురా! కటువచస్సో నాల్కకున్ రాదురా"

ఇది పాత మాట–

## 50 ఏళ్ల క్రితం ఈవారం

**7-12-1962**
**పేజీలు: 12 వెల: 0–20 న.పై**

### మహబూబ్‌ఖాన్ మృతి!

నెల్లూరు మునిసిపల్ ఛైర్మన్, నజీరియా మోటారు సర్వీస్ యజమాని సౌదాగర్ మహబూబ్‌ఖాన్ సాహెబు, చాలాకాలంగా అస్వస్థులుగా ఉంటూ, 6వ తేది రాత్రి 2.30లకు మద్రాసులో మరణించారని తెలియజేయుటకు చింతిస్తున్నాము. వారి వయస్సు షుమారు 67 సంవత్సరాలు.

స్వయంకృషితో, స్వయం ప్రతిభతో ప్రతి నిముషాన్ని సద్వినియోగం జేసికొని, చిన్న స్థితి నుంచి మహోన్నత దశనందుకొన్న వ్యక్తి మహబూబ్‌ఖాన్. మహబూబ్‌ఖాన్ విద్యావంతుడుగాదు. కానీ అఖండమైన మేధావి. అద్వితీయమైన వ్యాపారి; అసమానుడైన యజమాని. 1927లో టవున్ బస్ సర్వీస్ భాగస్తుడుగా ఉండిన మహబూబ్‌ఖాన్ 1935లో అందులో నుండి విడబడి ఒక్క బస్సుతో నజీరియా మోటారు సర్వీసును ప్రారంభించారు. అది వారి ఉజ్వల యాజమాన్యంతో దిన దిన ప్రవర్థమానమై నేడు 100 బస్సులతో, 100 లారీలతో రాష్ట్రంలో పెద్ద రవాణా సంస్థగా పేరుబొందింది. మహబూబ్‌ఖాన్ కేవలం బస్ యజమానే గాదు. వారు చేయని వ్యాపారంగానీ, విజయం పొందని సందర్భంగానీ లేదు. మైకా ఓనరు, ఫారెస్టు కాంట్రాక్టరు, కట్టెల వ్యాపారి, పెట్రోల్ డీలరు... ఒక్కటేమిటి వందల సంఖ్యలో ఉంటవి వారి వ్యాపార సంస్థలు. అంతటి సృజనాత్మకమైన, నిర్మాణాత్మకమైన, చైతన్యవంతమైన వ్యాపారదక్షత వారిది. మట్టిని సైతం బంగారుగా మార్చగల అమృత హస్తం. మొట్టమొదటిసారిగా 1924లో మునిసిపల్ కౌన్సిలర్‌గా ఎన్నికైన ఆయన 1953 వరకు అలానే కొనసాగి 53 నుంచి 1960 వరకు ఛైర్మన్‌గా ఎన్నికయ్యే వరకు వైస్ ఛైర్మన్‌గా వ్యవహరించారు. ఎసి రాజీనామా అనంతరం ఛైర్మన్‌గా ఎన్నికయ్యారు.

# నెల్లూరు ముచ్చట్లు

## నెల్లూరులో రాహుల్ దూత

నెల్లూరు పార్లమెంటు నియోజక వర్గ పరిధిలోని అసెంబ్లీ నియోజకవర్గాలలో కాంగ్రెస్ పార్టీ ప్రస్తుత స్థితిగతుల పరిశీలనకు రాహుల్ గాంధీ నియమించిన ప్రత్యేక బృంద సభ్యుడు గోవా ఎమ్మెల్యే విశ్వజిత్.పి.రాణా 3వ తేది నెల్లూరు వచ్చారు. ఈ నియోజకవర్గ పరిధిలోని అసెంబ్లీ నియోజకవర్గ నేతలతో విడివిడిగా మాట్లాడారు. నియోజక వర్గాలలో పార్టీ స్థితి, వైఎస్‌ఆర్ కాంగ్రెస్ పరిస్థితిపై రాణా వాకబు చేశారు. రాహుల్ దూత అడగకపోయినా పార్టీ నేతలు జగన్ పార్టీని ఎదుర్కోవాలంటే నామినేటెడ్ పోస్టులను వెంటనే భర్తీ చేయాలని కోరారు. బిసిలకు ప్రత్యేక గుర్తింపు ఇచ్చే విధంగా పార్టీలో సముచిత స్థానాలు కల్పించమని కోరారు. స్థానిక సంస్థల ఎన్నికలు ఎంత త్వరగా జరిపిస్తే అంత మంచిదని కొందరు నేతలు సూచించారు. నెల్లూరు లోక్ సభకు 2014 ఎన్నికల్లో ఆనం రామ నారాయణరెడ్డి, ఆనం వివేకానందరెడ్డి, మాగుంట శ్రీనివాసులురెడ్డి లేదా పార్వ తమ్మలలో ఎవరో ఒకరికి సీటు ఇస్తే ఫలితముంటుందని చెప్పినట్లు తెలిసింది. దూత వద్ద కావలి నియోజకవర్గంలోని నేతలు మధుబాబు నాయుడు, తాళ్లూరు రమణయ్య నాయుడు విష్ణువర్ధన్‌రెడ్డిని ఎలా ఇన్‌ఛార్జ్ చేస్తారని ప్రశ్నించి కాస్త గందరగోళం సృష్టించారు. రాజీవ్ దూతకు తెలుగు రాకపోవడం వల్ల చాట్ల నరసింహారావు దుబాసీగా వ్యవహరించారు. ఇందిరాభవన్‌లో అభిప్రాయసేకరణ అనంతరం రాణా మాగుంట స్వగృహానికి వెళ్లి విశ్రాంతి తీసుకొని ఒంగోలుకు బయలుదేరి వెళ్లారు. రాజీవ్ దూతను కలసిన నాయకుల్లో ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి, ఆనం విజయ కుమార్‌రెడ్డి, విష్ణువర్ధన్‌రెడ్డి, మాదాల జానకిరాం, కంభం విజయరామిరెడ్డి, చెంచలబాబు యాదవ్, పనబాక కృష్ణయ్య, సివి శేషారెడ్డి, ఏసునాయుడు, బాల సుధాకర్ తదితరులున్నారు.



## యూనివర్శిటీకి కొత్త రిజిస్ట్రార్!

నెల్లూరు విక్రమ సింహపురి యూనివర్శిటీ రిజిస్ట్రార్‌గా ప్రొఫెసర్ నాగేంద్ర ప్రసాద్ 3వ తేది వేదపండితుల మంత్రోచ్చారణ నడుమ బాధ్యతలు తీసుకొన్నారు. నాగేంద్ర ప్రసాద్ జిల్లా వాసే. ఆయన స్వగ్రామం తోటపల్లి గూడూరు మండలంలోని తోటపల్లి. సెయింట్ పీటర్స్, విఆర్ కాలేజి, ఎస్వీ ఇంజనీరింగ్ కాలేజీలలో ఆయన చదువు కొనసాగింది. చదివిన తిరుపతి ఇంజనీరింగ్ కాలేజిలోనే ప్రొఫెసర్‌గా చేరిన ఆయన ఆ విభాగాధిపతి అయ్యారు. 70కుపైగా జాతీయ, అంతర్జాతీయ పరిశోధనా పత్రాలు సమర్పించిన ఈయనకు 2010 సంవత్సరంలో రాష్ట్ర ప్రభుత్వం ఉత్తమ ఉపాధ్యాయుని అవార్డు ప్రకటించింది. 12 మంది పిహెచ్‌డి చేసిన పరిశోధక విద్యార్థులకు నేతృత్వం వహించిన గురువుగా నాగేంద్రప్రసాద్‌కు అనుభవముంది. యూనివర్శిటీ ఎదుర్కొంటున్న సమస్యల పరిష్కారానికి తనవంతు కృషి చేస్తానని బాధ్యతల స్వీకరణ సందర్భంగా నాగేంద్ర ప్రసాద్ మీడియాకు చెప్పారు.

## ఆమంచర్ల చెరువులో దిగిన నేవీ హెలికాప్టర్!

విజయవాడ నుంచి తిరుపతికి వెళ్తున్న నేవీ హెలికాప్టర్‌కు నెల్లూరు గగన సీమలో వర్షం మూలంగా సిగ్నల్స్ అందకపోవడంతో పైలెట్ ఆమంచర్ల చెరువులో 3వతేది అత్యవసరంగా దింపేశాడు. హెలికాప్టర్ పాతది కావడం వల్ల సిగ్నల్స్ అందలేదట. ఎఎస్పీ చంద్రశేఖర్ ఈ హెలికాప్టర్‌ను పోలీస్ పెరేడ్ గ్రౌండ్‌కు తరలించారు. ఈ వార్త వ్రాసే సమయానికి కూడా హెలికాప్టర్ పోలీస్ గ్రౌండ్‌లోనే ఉంది. హెలికాప్టర్‌లో పది మంది నేవీ సిబ్బంది ఉండినారు. హెలికాప్టర్‌ను గాలి వాన వల్ల దింపే సమయంలో అదృష్టవశాత్తు చిన్న నష్టం కూడా జరగలేదు. హెలికాప్టర్‌లో వెళ్తుండిన సిబ్బంది ఈ సమయంలో నెల్లూరు భోజనం గూర్చి ముచ్చట్లాడుకొంటుండినారట. ఆతిథ్యంలో పేరుగాంచిన నెల్లూరీయుల తత్వానికి భిన్నంగా వీరికి పెద్దాస్పత్రిలో రోగులకు పంపే ఇస్కాన్ భోజనాన్ని తీసుకెళ్లి పరువు పోగొట్టారు మన పోలీసులు.

## మంచి వర్షం

అల్పపీడనం మూలంగా 3, 4, 5తేదీల్లో నెల్లూరులో కురిసిన వర్షానికి ప్రజాజీవనం స్తంభించి పోయింది. వర్షం దంచి కొట్టడంతో రోడ్లపై ఎక్కడి నీళ్లు అక్కడ నిలచి పోయాయి. స్వల్ప వ్యవధిలోనే బాక్స్‌టైప్ బ్రిడ్జీలన్నీ వర్షపునీటితో నిండిపోవడంతో జనాలు వర్షవ్యూహంలో ఇరుక్కొని పోయారు. ఈ వర్షం మెట్ట ప్రాంతాలు మినహా తీరప్రాంత మండలాలన్నింటిలో పడడంతో రైతుల్లో హర్షం వ్యక్తమయ్యింది.

## నెల్లూరులో రాష్ట్రపతి తనయుడు

రాష్ట్రపతి ప్రణబ్ ముఖర్జీ తనయుడు పార్లమెంటు సభ్యుడు అభిజిత్ ముఖర్జీ నవంబర్ 30వ తేది నెల్లూరు వచ్చారు. కుటుంబ సమేతంగా ఇక్కడకు వచ్చిన ఆయన కృష్ణపట్నం ఓడరేవును సందర్శించి రాత్రి అక్కడే బసచేసి 1వ తేది తిరుమల బయలుదేరి వెళ్లారు. నిశ్శబ్దంగా సాగింది ఆయన ఓడరేవు సందర్శన.

### చందాదారులకు మనవి

- చందా పంపించేటప్పుడు తమ చందా నెంబరు, పూర్తి పేరు, చిరునామా తెలియపరచండి.
- మీ చందా నెంబరు, చందా ఏ తేదికి అయిపోతుందో, అడ్రసు రేపరు మీదనే ముద్రించి వుంటుంది.
- 'జమీన్‌రైతు' చందాదార్లు తమ చందాను ఎం.ఓ/డి.డి లేదా Online‌లో ఆంధ్రాబ్యాంక్, విఆర్‌కాలేజి బ్రాంచి, నెల్లూరు అకౌంట్ నెంబర్: 106811011000423లో ZAMINRYOT పేరుతో జమచేయవచ్చు. సకాలంలో చందా చెల్లించవలసినదిగా కోరుతున్నాము.
- చెక్కులు స్వీకరించబడవు.

**జీవిత చందా రూ.1000/-**

**సంవత్సర చందా**
స్వదేశంలో రూ.200/-
విదేశాలకు రూ.1000/-

**జమీన్‌రైతు**
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190

## సంచుల్లో రేషన్ సరుకులు!

ఈ నెల నుంచి చౌక దుకాణాల నుంచి ప్రజలకిచ్చే రేషన్ సరుకులను సంచుల్లో ప్యాక్‌చేసి ఇవ్వనున్నారు. బియ్యం, చక్కెర, కందిపప్పు, ఉప్పు, చింతపండు ప్యాకెట్ల రూపంలోనే ఇస్తారు. బియ్యాన్ని 4, 8, 12, 16, 20 కిలోల చిన్న చిన్న సంచుల్లో స్టాక్ పాయింట్లలోనే సిద్ధంగా ఉంచుతున్నారు. రేషన్ సరుకులు బ్లాక్ మార్కెట్‌కు తరలకుండా ఈ ఏర్పాటు చేస్తున్నారు. ఫలితం ఎలా ఉంటుందనేది కొన్నాళ్లు ఆగితేగానీ తెలియదు.



ఈతకోట సుబ్బారావు రచించిన నీటిచుక్క దీర్ఘ కవితా పుస్తకాన్ని ఆవిష్కరిస్తున్న నటుడు తనికెళ్లభరణి. చిత్రంలో పెరుగు రామకృష్ణ, ఖదీర్‌బాబు, అమరావతి కృష్ణారెడ్డి, హరిబాబు, డాక్టర్ సుధాకర్ వున్నారు.

## రికార్డుస్థాయి ధరకు జిలకరమసూరి వడ్లు!

ఈ యేడాది జిలకర మసూరి రకం వడ్లు పండించి నిల్వచేసిన రైతుల పంట పడింది. గతంలో ఎన్నడూలేనట్లుగా జిలకర మసూరి రకం వడ్లు పుట్టి ప్రస్తుతం 20వేల రూపాయల ధర పలుకుతుంది. గతంలో ఈ రకం వడ్లు రికార్డు స్థాయి ధర 16వేలుగా పలికింది. ఈ రేటు వల్ల ఈ రకం 25 కిలోల బియ్యం బస్తా కూడా 900 రూపాయల నుంచి 1050 రూపాయల ధర పలకడం విశేషం.

## రికార్డు బద్దలు కొట్టిన దర్గా హుండీ!

రొట్టెల పండుగ సందర్భంగా బారాషహీద్ దర్గా వద్ద ఏర్పాటుచేసిన హుండీల ఆదాయం గత రికార్డులను అధికమించింది. ఈసారి హుండీల్లో కానుకలను లెక్కించగా 16 లక్షల 78వేల 500 రూపాయలతోపాటు 150 గ్రాముల వెండి ఉండింది. దర్గాలో ఏడాది మొత్తం ఉంచిన హుండీల్లో 4 లక్షల 70వేలు, అంగళ్ల అద్దెలు, ఇతరత్రా పాటల ద్వారా 19 లక్షల 11వేలు వచ్చింది. మొత్తం ఆదాయంగా లెక్కగడితే 40 లక్షల 67వేల రూపాయలు వచ్చిందని చెప్పొచ్చు. 40 లక్షల రూపాయల ఆదాయమున్న దర్గాను వక్ఫ్‌బోర్డు ఐదారు లక్షలకు లీజుకు ఇవ్వాలని చూసిందంటే హైదరాబాద్‌లో ఉన్న ఈ శాఖాధికారులను ఏమనాలి? దర్గాకొచ్చిన ఆదాయాన్ని దర్గా దగ్గర అభివృద్ధి పనులకు వినియోగిస్తే సార్థకత చేకూరుతుంది. వచ్చే ఏడాది మరింత కానుకలు భక్తులు హుండీల్లో వేస్తారు.

## చెరుకు రైతుల బకాయిలు చెల్లించండి!

కోవూరు సహకార చక్కెర కర్మాగారానికి రైతులు చెరుకు సరఫరా చేసినందుకుగాను చెల్లించాల్సిన బకాయి మొత్తం వెంటనే ఇచ్చేలా ఆదేశాలు ఇవ్వమని ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డిని జిల్లాకు చెందిన తెలుగుదేశం పార్టీ ఎమ్మెల్యేలు 1వ తేది కలసి విజ్ఞప్తి చేశారు. ముఖ్యమంత్రిని కలసిన వారిలో కావలి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు, గూడూరు, సూళ్లూరుపేట ఎమ్మెల్యేలు బల్లి దుర్గా ప్రసాద్, పరసా రత్నం ఉన్నారు.

చెరుకు రైతులకు బకాయిలు చెల్లిస్తానని ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి చేసిన వాగ్దానాన్ని నిలబెట్టుకోలేక పోయారు.

## కొత్త ట్రాఫిక్ సిఐ!

నెల్లూరు నార్త్ ట్రాఫిక్ సిఐగా సురేష్‌కుమార్‌రెడ్డి నవంబర్ 30వ తేదీ బాధ్యతలు తీసుకొన్నారు. గతంలో ఈయనకు నార్త్ సర్కిల్ లా అండ్ ఆర్డర్ సిఐగా పనిచేసిన అనుభవం ఉంది. ఈ మధ్య ఆయన్ను బాపట్ల సిఐగా మార్చినా తాజా బదలీల్లో నెల్లూరుకు పంపారు. ఇక్కడ ట్రాఫిక్ సిఐగా పనిచేస్తుండిన రమేష్‌రెడ్డిని గుంటూరు విఆర్‌లో రిపోర్టు చేసుకోమన్నారు. సురేష్‌కుమార్ రెడ్డి నెమ్మదస్తుడు. ట్రాఫిక్‌లో పొగరుబోతు సిఐలుండాలి. మరి ఈయన ఎలా రాణిస్తాడో కాలమే సమాధానం చెప్పాలి.

కొరవ 14వ పేజీలో

• నెల్లూరులో తిష్టవేసిన

# ఎర్రచందనం స్మగ్లర్లు!

## అయినా పట్టించుకోని అటవీ, పోలీస్ శాఖలు



లక్షల రూపాయలు విలువచేసే ఎర్రచందనం దుంగలు.

నెల్లూరు కేంద్రంగా జరుగుతున్న ఎర్రచందనం స్మగ్లింగ్‌ను అడ్డుకోవాలని సాక్షాత్తు ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి కలెక్టర్, ఎస్పీలను ఆదేశించడంతో జిల్లాలో గుట్టుగా జరుగుతున్న ఈ స్మగ్లింగ్ వ్యవహారం గుప్పుమంది. పేరుగాంచిన ఎర్రచందనం స్మగ్లర్లు చెన్నై అలీ ఖాన్, కడప రెడ్డినాయుడు నెల్లూరులోనే తిష్టవేసి ఈ స్మగ్లింగ్ వ్యవహారాన్ని పర్యవేక్షిస్తున్నట్లు వార్తలు వినవస్తున్నాయి. ప్రపంచంలో ఎర్రచందనానికి మంచి రేటు ఉండడం, అది నెల్లూరు, కడప, చిత్తూరు జిల్లాలలోనే దొరుకుతుండడంతో దీనికి ఎక్కడలేని డిమాండ్ ఉంది. వెంకటగిరి, రాపూరు, ఉదయగిరి అడవుల్లో ఎర్రచందనం విస్తారంగా దొరుకుతుంది. ఈ మూడు మండలాలలోని 38 గ్రామాల ప్రజలు ఎర్రచందనం స్మగ్లర్లకు సహకారం అందిస్తున్నట్లు అటవీ శాఖ ఒక నివేదిక రూపొందించింది. జిల్లా మొత్తంమీద 180 మంది ఈ స్మగ్లింగ్‌లో ప్రత్యక్షంగా పాల్గొంటున్నట్లు లెక్కలున్నాయి. కానీ వీరిని అరెస్ట్ చేయకపోవడానికి పోలీసులు, అటవీ శాఖ పెద్ద సిబ్బందికి మొత్తంలో ఇచ్చే లంచాలే కారణమని చెబుతున్నారు. పోలీసు రికార్డుల ప్రకారం ఎర్రచందనాన్ని స్మగ్లింగ్ చేస్తున్న 110 వాహనాలను స్వాధీనం చేసుకొన్నా స్మగ్లర్లు ఎందుకు పట్టుకపోయారన్న దానికి సమాధానమే లేదు. ముఖ్యమంత్రి మందలింపు తర్వాత ఈ వారంలో అటవీ, పోలీస్ శాఖలు సంయుక్తంగా సమావేశమై స్మగ్లర్ల పనిపట్టను సంయుక్త ప్రణాళికలు రూపొందించాలని తీర్మానించాయి. దీనికిగాను వెంకటగిరిలో ఒక వర్క్‌షాపును నిర్వహించాలని నిర్ణయించాయి. పోలీసులు, అటవీ శాఖ గట్టిగా కృషిచేస్తే పది రోజుల్లో ఎర్రచందనం స్మగ్లింగ్‌ను నిరోధించగలరు. కానీ ఈ రెండు శాఖల్లో చిత్తశుద్ధే ప్రశ్నార్థకం. అదే స్మగ్లర్లకు బలమని చెప్పక తప్పదు.

# చదివిన దొంగల అరెస్ట్!

## విలాస జీవితం కోసం దొంగలుగా మారారా?

పాతరోజుల్లో దొంగతనాలు చదువు సంధ్యాలేని వాళ్లు చేస్తుండేవారు. మన జిల్లాలో కప్పరాళ్ల తిప్పవాసులు చేయి తిరిగిన దొంగలుగా ప్రసిద్ధులు. నవంబర్ 30వ తేదీ క్రైం పోలీసుల చేతికి చిక్కి 30 సవర్ల బంగారు నగలు, తొమ్మిది లక్షల సొమ్ము రికవరీకి సహకరించిన ఐదుగురు యువ దొంగల చరిత్ర చూస్తే వీరంతా బాగా చదివిన వారు, 25 ఏళ్ల లోపు వయస్సులు కావడం ఆలోచింప జేసింది. నెల్లూరు ముత్యాలపాళెం, కోడూరు బీచ్, నెల్లూరు కిసాన్‌నగర్, మినీ బైపాస్‌రోడ్డు, సుజాతమ్మ కాలనీ, సిఎంఆర్ షాపింగ్‌మాల్, హరనాధపురం, రాజరాజేశ్వరి గుడి, పోలీస్ కాలనీల్లో అలవోకగా వీరు దొంగతనాలు చేశారు. రోడ్డున నడిచి వెళ్తున్న వారిని, దేవాలయ దర్శనా



దొంగతనాల వివరాలు వెల్లడిస్తున్న ఎస్పీ బి.వి.రమణకుమార్.

నికి, షాపింగ్‌కు వెళ్లిన వారిని ఎడాపెడా దోచేశారు. ఈ దొంగలలో ఒకడైన తమ్మిశెట్టి నరేష్‌ది కప్పరాళ్లతిప్ప. బిఏ కంప్యూటర్స్ చదివాడు. అల్లూరు మండలం పురిణి గ్రామానికి చెందిన నేతగాని సుబ్బయ్య బికామ్ కంప్యూటర్స్ చదివాడు. కప్పల హర్షవర్ధన్ కూడా బాగా చదువుకొన్న వాడే. చేజర్ల మండలం మాముడూరుకు చెందిన గంగపట్నం రమేష్ కూడా బికామ్ కంప్యూటర్స్ చదివాడు. ఈ బ్యాచ్‌లో తిరుమలకొండ ప్రసాద్ ఒక్కడే ఆటోడ్రైవర్. మహా తెలివైన ఈ యువకులు ఎందుకు దొంగలుగా మారారన్నది పోలీసులు చెప్పకపోయినా వీరిని అరెస్ట్ చేయడంలో సిసిఎస్ సిఐలు వీరాంజనేయరెడ్డి, ఖాసింపీరా, బి.రామారావు, ఎస్ఐలు జగత్‌సింగ్, నరసింహారావు సిబ్బంది ఎ.శ్రీనివాసులు, పి.సుధాకర్, వి.శేషయ్య, శిఖామణి, నరేంద్ర, శివకుమార్, ప్రసాద్ బాగా శ్రమించినట్లు ఎస్పీ బివి రమణకుమార్ ప్రకటించి ప్రోత్సాహకాలు అందించారు.

# పాదయాత్రలకు అన్ని పార్టీలు రెడీ!

## ఒక్కసారిగా ప్రజలపై పెరిగిన ప్రేమ

జిల్లాలో యాత్రల సీజన్ ఆరంభమయ్యింది. భక్తులు దైవదర్శనం కోసం చేసే తీర్థయాత్రలనుకుంటే పప్పులో కాలేసినట్లే. ఇవి ఆధ్యాత్మిక యాత్రలు కాదు... వివిధ పార్టీలు ప్రజలను ఆకట్టుకొనేందుకు చేస్తున్న రాజకీయ యాత్రలు. ఎన్నికలు వచ్చినప్పుడో, ఎన్నికల వాతావరణం ఏర్పడినప్పుడో రాజకీయ పార్టీలు వివిధ కార్యక్రమాల పేరుతో దడబడలు సృష్టించడం, ప్రజలను ఆకర్షించేందుకు ప్రయత్నించడం సహజం. అలాంటి వాతావరణమే ఇప్పుడు ఏర్పడింది. రాష్ట్ర రాజకీయాల్లో రోజు రోజుకు మార్పులు జరుగనున్నాయనే ప్రచారం జరుగుతుండడం, మధ్యంతర ఎన్నికలు రావచ్చనే ఊహాగానాలు వ్యక్తం అవుతుండడంతో ఎవరికి వారు వివిధ పార్టీల నేతలు కార్యక్రమాలను రూపొందించడానికి ప్రజలను కలుసుకొనేందుకు సమాయత్తం అవుతున్నాయి. తెలుగుదేశం పార్టీ అధినేత చంద్రబాబునాయుడు వస్తున్నా మీ కోసం పేరుతో సుదీర్ఘ పాదయాత్ర చేపట్టాడు. తమ నేత ప్రారంభించిన పాదయాత్రకు అనుగుణంగా జిల్లాలోనూ వివిధ ప్రాంతాలలో పాదయాత్రలు చేసేందుకు తెలుగుదేశం పార్టీ సిద్ధమవుతోంది. ఇక వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ తరపున వైఎస్ రాజశేఖర్‌రెడ్డి కుమార్తె షర్మిళ మరో ప్రజాప్రస్థానం పేరుతో సుదూర లక్ష్యాన్ని నిర్ణయించుకొని పాదయాత్ర చేస్తోంది. దీంతో జిల్లాలోని వివిధ నియోజకవర్గాలలో పాదయాత్రలు చేసేందుకు ఆ పార్టీ నేతలు సిద్ధమవుతున్నారు. ఈ పార్టీలకు తామేమీ తీసిపోమంటూ సిపిఎం పార్టీ సైతం పాదయాత్రకు ప్రణాళికలు రూపొందించింది. బిజెపి సైతం ప్రజల వద్దకు వెళ్లేందుకు కార్యక్రమాన్ని రూపొందిస్తున్నట్లు సమాచారం. ప్రధాన రాజకీయ పార్టీలన్నీ ఒక్కసారిగా పాదయాత్రలకు సిద్ధమవడంతో ప్రజల్లో దీనిపై తీవ్రమైన చర్చ జరుగుతోంది. అధికార పార్టీ ప్రజాధనాన్ని కాంట్రాక్టర్లకు దోచిపెడుతున్నా, విలువైన స్థలాలను ఆ పార్టీ నేతలు తమ అనుచరులకు పందారం చేస్తున్నా స్పందించని ప్రధాన పార్టీలు ఇప్పుడు పాదయాత్రలకు దిగడం పట్ల పలువురు ప్రజలు విమర్శిస్తున్నారు. తూతూ మంత్రంగా ఒకటి రెండు ఆందోళన కార్యక్రమాలు చేపట్టి ప్రజల పక్షాన పోరాడామని చెప్పుకోవడం తప్ప నిజంగా ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలపై నిఖార్సుగా ఉద్యమించిన పార్టీలుగానీ, నేతలుగానీ లేరని అధిక సంఖ్యాకులు వ్యక్తం చేస్తున్న అభిప్రాయం. ఈ పరిస్థితుల్లో అన్ని పార్టీలు చేస్తున్న పాదయాత్రలు ఏ మేరకు ఫలితాన్నిస్తాయో చూడాలి.

# ఘనంగా రిజిస్ట్రార్ నరేంద్రరావు అభినందన సభ



నరేంద్రరావును సన్మానిస్తున్న ఆయన అభిమానులు.

నెల్లూరు జాయింట్ సబ్ రిజిష్ట్రార్‌గా పనిచేస్తూ పదవీ విరమణ చేసిన పూడి నరేంద్రరావు సన్మానసభ డిసెంబర్ 2వ తేదీ స్థానిక అనిల్ గార్డెన్స్‌లో ఘనంగా జరిగింది. కార్యాలయ సిబ్బంది, మిత్రులు, సన్నిహితులు ఈ వీడ్కోలు సభకు హాజరై తమ అభిమానాన్ని చాటుకొన్నారు. ముఖ్య అతిథిగా విచ్చేసిన రిజిస్ట్రేషన్ల విభాగం డిఐజి సత్యనారాయణ మాట్లాడుతూ 32 ఏళ్లుగా రిజిస్ట్రేషన్ల శాఖలో నరేంద్రరావు చేసిన సేవలను కొనియాడారు. అనంతరం ఆయన్ను ఘనంగా పూలమాలలు, శాలువాలతో సత్కరించారు. ఈ పదవీ విరమణ కార్యక్రమంలో అడిషనల్ డిజి జయరామిరెడ్డి, ఒంగోలు డిఐజి రాంబాబు, జాయింట్ సబ్ రిజిష్ట్రార్ ప్రసాద్‌తోపాటు విజయవాడ, కర్నూలు, మచిలీపట్నం తదితర ప్రాంతాల నుంచి అధికారులు విచ్చేసి నరేంద్రరావును సన్మానించారు.

# టీచర్లకు పదోన్నతులు ఇవ్వని డిఇఓ!

## తనను సంతృప్తి పరచిన వారికే పోస్టింగ్స్



దేవుడు వరమిచ్చినా పూజారి వరమివ్వడన్న చందంగా ఉంది జిల్లా విద్యాశాఖలో పదోన్నతుల వ్యవహారం. ఉపాధ్యాయుల పదోన్నతులపై కొత్త మార్గదర్శకాలు జారీ చేసింది. గతంలో ఇచ్చే పదోన్నతులకు భిన్నంగా ప్రతి నెలా హైస్కూల్ హెడ్ మాస్టర్లు, స్కూలు అసిస్టెంట్లు ఇతర క్యాడర్ల ఉపాధ్యాయులకు పదోన్నతులు అందించాలని జీవో జారీ చేసింది. ప్రభుత్వం జీవో ఇచ్చినప్పటికీ జిల్లాలో మాత్రం ఇది అమలు కావడం లేదు. ఉపాధ్యాయులకు పదోన్నతులు ఇవ్వకుండా జిల్లా విద్యాశాఖాధికారి ముప్వా రామలింగం అవినీతి ధోరణి అవలంభిస్తుండడంపై విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. మూడు నెలలుగా ఈ ప్రక్రియ నిలిచిపోయి ఉంది. ఈ పదోన్నతులు జరపక పోవడం వెనుక పెద్ద ఎత్తున డబ్బులు చేతులు మారినట్లు సమాచారం. నగరానికి దగ్గర గల ప్రాంతాల్లోని పాఠశాలలకు బదలీ చేయించుకునేందుకు కొందరు ఉపాధ్యాయులు, హెడ్‌మాస్టర్లు విద్యాశాఖాధికారితో బేరం కుదుర్చుకున్నారనే ఆరోపణలు వ్యక్తం అవుతున్నాయి. గతంలో రాజీవ్ విద్యామిషన్‌లో పనిచేసిన దక్షిలికి చెందిన ఒక హెడ్‌మాస్టర్ నగరానికి సమీపంలో గల హెచ్ఆర్ఏ క్రిందకు వచ్చే పాటూరు హైస్కూల్‌కు వెళ్లేందుకు విద్యాశాఖాధికారికి ముడుపులు అందజేశారన్న వ్యవహారం గగ్గోలు రేగుతోంది. ఇలాంటి వారికి 'న్యాయం' చేసేందుకు, వారికిచ్చిన 'మాట' అందిన మూట కోసం ఈ పదోన్నతుల ప్రక్రియను చేపట్టకుండా వాయిదా వేసినట్లు విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. తనకు చేయి తడిపిన వారి విషయంలో డిఇఓ ఎంత ప్రేమగా ఉంటాడో, ఎంత అండగా ఉంటాడో జగమెరిగిన సత్యం. తన జేబులు నింపుతున్న అలాంటి వారికోసం ఎంతటి అడ్డదారులైనా తొక్కుతాడని పలు ఘటనలు రుజువు చేశాయి. విద్యార్థులకు బోధనలో నష్టం జరుగకుండా ఉండేందుకు ప్రభుత్వం పదోన్నతులకు అవకాశం కల్పించినా అధికారుల తీరు వలన విద్యార్థులు తీవ్రంగా నష్టపోవాల్సి వస్తోంది.

# నాలుగు దశాబ్దాలుగా నెల్లూరు వైద్య రంగంలో విశిష్ట సేవలు అందిస్తున్న ఆదర్శ కుటుంబం



## డాక్టర్ యం.హరిశ్చంద్రారెడ్డి

దంతవైద్య నిపుణులు

నెల్లూరు దంతవైద్య రంగంలో అగ్రగామిగా వెలుగొందుతున్న దంతవైద్యశాల డాక్టర్ హరిశ్చంద్రారెడ్డి దంతవైద్యశాల. 1972వ సంవత్సరంలో నెల్లూరులో బృందావనంలో చిన్న హాస్పిటల్‌గా ప్రారంభమై నేడు అత్యాధునిక అధునాతమైన పరికరాలతో సూపర్‌స్పెషాలిటీ హాస్పిటల్‌గా గుర్తింపు పొందింది. డాక్టర్ హరిశ్చంద్రారెడ్డి కృషి, పట్టుదల, వృత్తి పట్ల నిబద్ధత ఈ హాస్పిటల్ అభివృద్ధికి దోహద పడ్డాయి. డాక్టర్ హరిశ్చంద్రారెడ్డిది చిత్తూరుజిల్లా పోలవరం గ్రామం. ఉస్మానియా యూనివర్శిటిలో బిడిఎస్ పూర్తి చేసి ఖాళీగా వుండకుండా నెల్లూరు బృందావనం పీపుల్స్ పాలీక్లినిక్ ప్రక్కన హాస్పిటల్ ప్రారంభించారు. అప్పట్లో వైద్య రంగంలో ఉద్దండులుగా వెలుగొందుతున్న సేవాతత్పరులు డాక్టర్లు జెట్టి శేషారెడ్డి, జెట్టి ప్రభాకర్‌రెడ్డి, చెర్లో రమణారెడ్డిగార్లను ఆదర్శంగా తీసుకొని వారి పోత్సాహం, పోద్భలంతో వృత్తినే దైవంగా నమ్మి పేషంట్లకు సేవలందిస్తూ మంచిపేరు ప్రఖ్యాతులు సొంతం చేసుకొన్నారు డాక్టర్ హరిశ్చంద్రారెడ్డి. పన్ను పీకడమే దంతవైద్యం అనే పాతరోజుల్లో హాస్పిటల్‌ను ప్రారంభించి ఈ రోజు పంటిని కాపాడుకొనే ఆధునిక పద్ధతులను, ఆధునిక పరికరాలను నెల్లూరుకు పరిచయం చేయడంలో ఎప్పుడూ ముందుంటూ, వైద్య రంగంలో వస్తున్న నూతన మార్పులను గమనిస్తూ లేజర్‌ట్రీట్‌మెంట్, డిజిటల్ ఓపిజి, డిగోరా ఎక్స్‌రే, వేల్‌వన్ (రూట్‌కెనాల్ ట్రీట్‌మెంట్) ఎలక్ట్రోకాటరీ, డిజిటల్ డెంటల్‌స్కానింగ్, డిజిటలైజ్డ్ ఆర్థోప్యాంటమోగ్రాఫ్ పరికరాలను తన క్లినిక్‌లో ఏర్పాటు చేశారు. ఇవి నెల్లూరులో మొట్టమొదటిసారిగా డాక్టర్ హరిశ్చంద్రారెడ్డి దంతవైద్యశాలలో మాత్రమే ఏర్పాటు చేయడం గమనార్హం, వైద్యరంగం మీద మక్కువతో తన కుమారులు ఇద్దరినీ దంతవైద్యులుగా తీర్చిదిద్ది పెద్ద కుమారుడు డాక్టర్ శ్రీనాధ్‌రెడ్డిని ఎత్తుపళ్లు, వంకరటింకర పళ్లను సరిచేసే నిపుణులు (ఆర్థోడాంటిస్ట్)గానూ, రెండవ కుమారుడు డాక్టర్ శ్రీధర్‌రెడ్డిని రూట్‌కెనాల్ మరియు ఫిక్స్‌డ్ పళ్ల స్పెషలిస్ట్‌గాను తీర్చి దిద్దారు. అంతే కాకుండా కోడళ్లుగా డాక్టర్లనే తన ఇంటికి తీసుకొని వచ్చారు.



ఓపిజి విభాగం

## దంత వైద్య విభాగపు స్పెషలిస్టులు



### డాక్టర్ శ్రీనాధ్‌రెడ్డి MDS

**ఎత్తు పళ్లు, వంకరటింకరపళ్లు సరిచేసే నిపుణులు**

డాక్టర్ శ్రీనాధ్‌రెడ్డి హరిశ్చంద్రారెడ్డి పెద్ద కుమారుడు, తన తండ్రి బాధ్యతను వారసత్వంగా తీసుకొన్న శ్రీనాధ్‌రెడ్డి దంత వైద్యంలో మెళకువలను, నైపుణ్యతను అవపోశన పట్టిన అపర మేధావి. దావణగిరిలోని బాపూజీ డెంటల్ కాలేజిలో MDS చేసే రోజుల్లోనే తాను ఇచ్చిన ప్రజంటేషన్‌లకు అవార్డులు పొందిన ఘనత శ్రీనాధ్‌రెడ్డిది. నెల్లూరులోని నారాయణ మెడికల్ కాలేజిలోనూ ప్రొఫెసర్‌గా సేవలందిస్తున్నారీయన.



### డాక్టర్ శ్రీధర్‌రెడ్డి MDS

**రూట్‌కెనాల్ స్పెషలిస్ట్ మరియు ఫిక్స్‌డ్ పళ్ల స్పెషలిస్ట్**

డాక్టర్ శ్రీధర్‌రెడ్డి హరిశ్చంద్రారెడ్డి గారి రెండవ కుమారుడు. దంత వైద్యంలో అపర ధన్వంతరి శ్రీధర్‌రెడ్డి. మద్రాసు సవిత డెంటల్ కాలేజిలో BDS, MDS పూర్తిచేసి రూట్‌కెనాల్ స్పెషలిస్ట్‌గా విశిష్ఠ సేవలు అందిస్తున్నారు శ్రీధర్‌రెడ్డి. చిన్న వయస్సులోనే నారాయణ మెడికల్ కాలేజీ ప్రొఫెసర్‌గా పనిచేస్తూ, భావి డాక్టర్లకు ఆదర్శ ప్రాయుడయ్యాడు శ్రీధర్‌రెడ్డి. అమెరికన్ అకాడమీ ఆఫ్ ఇంప్లాంట్ ఫిక్స్‌డ్ దంతాలు అమర్చడంలో ప్రత్యేక శిక్షణ పొందారు. అంతేకాక శ్రీలంక, మలేషియా, హాంకాంగ్, చైనా వంటి దేశాలలో రూట్‌కెనాల్ మరియు ఫిక్స్‌డ్ దంతాలు అమర్చే వివిధ సదస్సులలో పాల్గొన్నారు.



### డాక్టర్ ప్రసన్నకుమారి BDS

**Cosmotic Dental Surgeon**

డాక్టర్ ప్రసన్నకుమారి హరిశ్చంద్రారెడ్డి గారి రెండో కోడలు. డాక్టర్ శ్రీధర్‌రెడ్డి భార్య. దంతవైద్యంలో బెంగుళూరులో శిక్షణ పూర్తి చేసిన ఈమె పంటిని అందంగా తీర్చిదిద్దడంలో అద్భుత నైపుణ్యత సాధించిన డాక్టర్.

**డాక్టర్ హరిశ్చంద్రారెడ్డి దంత వైద్యశాల**

డాక్టర్ రామచంద్రారెడ్డి హాస్పిటల్ ప్రక్కన
బృందావనం, నెల్లూరు -1.
ఫోన్: 0861-2328060.



### డాక్టర్ సుమలతారెడ్డి MD

**Dermatologist**

చర్మ వ్యాధుల ప్రత్యేక నిపుణులు

డాక్టర్ సుమలతారెడ్డి డాక్టర్ హరిశ్చంద్రారెడ్డిగారి పెద్ద కోడలు. డాక్టర్ శ్రీనాధ్‌రెడ్డి భార్య. నెల్లూరులో చర్మ వ్యాధుల డాక్టర్లలో మొట్టమొదటగా యం.డి చేసిన మహిళా డాక్టర్. చర్మవ్యాధుల నిపుణురాలుగా డాక్టర్ సుమలతారెడ్డి నెల్లూరులో మూడుహాళ్ల వీధిలో సుమ స్కిన్ & కాస్మటాలజీ క్లినిక్‌ను ఏర్పాటుచేసి అత్యాధునిక వైద్య సేవలు అందిస్తూ అగ్రగామిగా తన వైద్యశాలను నిలిపారు.

## అంతర్జాతీయ ప్రమాణాల దంత వైద్యశాల హ్యాపీ డెంటల్ హాస్పిటల్

నెల్లూరులో అత్యున్నతమైన సాంకేతిక పరిజ్ఞానంతో ఏర్పాటు చేయబడిన మొట్టమొదటి హాస్పిటల్ హ్యాపీ డెంటల్ హాస్పిటల్. నెల్లూరీయులకు అంతర్జాతీయ ప్రమాణాలతో పూర్తిస్థాయి దంతవైద్యసేవలు అందించాలన్నదే డాక్టర్ హరిశ్చంద్రారెడ్డి ఆశయం. ఆయన ఆశయాన్ని హ్యాపీడెంటల్ హాస్పిటల్ ప్రారంభించడం ద్వారా నేరవేర్చుకొన్నారు. షుమారు ఆరు వేల చదరపు అడుగుల విస్తీర్ణంలో సువిశాలంగా దీనిని ఏర్పాటు చేశారు. పరిశుభ్రత విషయంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకోవడంతోపాటు ప్రపంచ శ్రేణి నాణ్యతా ప్రమాణాలకు అనుగుణంగా ఐదు అడ్వాన్స్‌డ్ డెంటల్ యూనిట్లను, మూడు విశాలమైన పరిశుభ్రమైన ఆపరేటరీలను ఏర్పాటు చేశారు. అమెరికన్ డెంటల్ అసోషియేషన్ నిర్దేశించిన మార్గదర్శకాలను అనుసరిస్తూ, పరిశుభ్రతకు ప్రాధాన్యత ఇస్తూ, దంత చికిత్సకు వాడే పరికరాలను స్టెరిలైజ్ చేయడం ఈ హాస్పిటల్ ప్రత్యేకత. ఇన్‌ఫెక్షన్లకు తావు లేకుండా అల్ట్రాసోనిక్ క్లీనింగ్ పక్రియ ద్వారా శస్త్ర చికిత్స పరికరాలను శుభ్రపరచడం ఈ హాస్పిటల్‌లోనే సాధ్యం. ఇటువంటి హాస్పిటల్స్ ద్వారా నెల్లూరీయులకు వైద్య సేవలు అందిస్తున్న డాక్టర్ హరిశ్చంద్రారెడ్డి కుటుంబం అందరికీ ఆదర్శప్రాయం.

**హ్యాపి డెంటల్ హాస్పిటల్**

డాక్టర్ రామచంద్రారెడ్డి హాస్పిటల్ ఎదురు
బృందావనం, నెల్లూరు -1.
ఫోన్: 0861-2349555.






అంతర్జాతీయ ఎయిడ్స్ దినోత్సవాన్ని పురస్కరించుకొని విఆర్ కాలేజిలో విద్యార్థుల చైతన్య ర్యాలీ ప్రారంభిస్తున్న ప్రిన్సిపల్ డాక్టర్ సివిఎస్.భాస్కర్, వైస్‌ప్రిన్సిపల్ డాక్టర్ బాబు.



నెల్లూరులోని రెడ్‌క్రాస్ క్యాన్సర్ ఆస్పత్రికి భగవాన్ మహావీర్ జైన్ ట్రస్ట్ తరఫున 70 లక్షల రూపాయల భారీ విరాళం ఇచ్చినందుకుగాను సతీష్‌జైన్‌ను సన్మానిస్తున్న రాష్ట్ర గవర్నర్ నరసింహన్.

# సుబ్బరామరెడ్డి బాటలో నడుస్తా!

## జయంతి వేడుకల్లో పార్వతమ్మ ప్రకటన

పేద ప్రజల అభ్యున్నతికి దివంగత మాగుంట సుబ్బరామరెడ్డి ఎనలేని కృషి చేశారని, ఆయన చూపిన బాటలోనే తాము నడుస్తున్నామని సుబ్బరామరెడ్డి సతీమణి మాజీ శాసనసభ్యురాలు మాగుంట పార్వతమ్మ తెలిపారు. ఇటీవల సుబ్బరామరెడ్డి 65వ జయంతి వేడుకలను కావలి పట్టణంలో ఘనంగా నిర్వహించారు. ఈ సందర్భంగా ఆమె ఆర్టీసి సెంటర్‌లో వున్న మాగుంట సుబ్బరామరెడ్డి విగ్రహానికి పూల మాలలు వేసి ఘన నివాళులు అర్పించారు. పేద ప్రజల కోసం అహర్నిశలు సుబ్బరామరెడ్డి పాటుపడ్డారని గుర్తు చేసుకొన్నారు. పేదలు ఆయన్ను తమ గుండెల్లో దాచుకొన్నారన్నారు. ఆయన ఆశయాలు కొనసాగించేందుకు తమవంతు కృషి చేస్తామన్నారు. ఈ కార్యక్రమంలో గ్రంధి యానాదిశెట్టి, నారాయణ, రాజశేఖర్, యాదగిరి, వెంకటేశ్వర్లు, శ్రీనివాసులరెడ్డి తదితరులు పాల్గొని సుబ్బరామరెడ్డికి ఘననివాళులు అర్పించారు.



# ప్రభుత్వ వైద్యులు ఆత్మ విమర్శ చేసుకోవాలి!

## వెంకటాచలంలో కలెక్టర్

ఆరోగ్యశాఖ ద్వారా ప్రవేశపెట్టిన మార్పు పథకం ఆశించిన స్థాయిలో అమలు కావడం లేదని జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి అసంతృప్తి వ్యక్తం చేశారు. సర్వేపల్లి నియోజకవర్గ పరిధిలో వివిధ పథకాల అమలుపై ఆయన వివిధ శాఖల అధికారులతో వెంకటాచలంలో సమీక్ష జరిపారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ ఆరోగ్యంపై దృష్టి నిలపాలన్నారు. ప్రభుత్వ వైద్యశాలల్లో కేవలం 20శాతంలోపే ప్రసవాలు జరుగుతుండడంపై వైద్యులు ఆత్మ విమర్శ చేసుకోవాలన్నారు. ప్రజలకు ప్రభుత్వ ఆస్పత్రుల పట్ల నమ్మకం కల్పించి నప్పుడే దీనిని అధిగమించవచ్చన్నారు. ఆయా ప్రాథమిక ఆరోగ్యకేంద్రాల పరిధిలోగల గర్భిణులు, బాలింతలు, వారి కుటుంబసభ్యులకు ప్రభుత్వ వైద్యశాల స్థితిగతులపై నమ్మకం కల్పించాలన్నారు. అంగన్ వాడీ కేంద్రాలలో పిల్లల సంఖ్య తగ్గిపోతోందంటూ దీనిపై ఐసిడిఎస్ దృష్టి పెట్టాలన్నారు. నిర్మల్ గ్రామ్ అభియాన్ క్రింద చేపడుతున్న వ్యక్తిగత మరుగుదొడ్ల నిర్మాణాలను వేగవంతం చేయాలన్నారు. సాంఘిక సంక్షేమ వసతి గృహాల్లోని పిల్లలకు ఇంటర్నెట్‌పై ప్రత్యేక శిక్షణ నివ్వాలన్నారు. పలు సందర్భాలలో క్రిందిస్థాయి అధికారుల అలసత్వంపై సుతిమెత్తగా చురకలు అంటించారు కలెక్టర్. ఈ సమావేశంలో డ్వామా పిడి గౌతమి, డిఎంహెచ్ఓ మాసిలామణి, ఆర్‌డిఓ మాధవీలతా, సిఇఓ వీరభద్రయ్య, ఐటిడిఏ, పంచాయితీరాజ్ తదితరశాఖల అధికారులు పాల్గొన్నారు.



# ఉపాధి హామీ పనులు సక్రమంగా నిర్వహించాలి!

గ్రామాల్లో ఉపాధిహామీ పనులను గ్రామసభల ద్వారానే గుర్తించాలని ఉపాధిహామీ పథకం ఏపిడి ప్రసాద్‌బాబు చెప్పారు. వెంకటగిరిలో ఉపాధి హామీ పథకంపై జరిగిన సమావేశంలో ఆయన పాల్గొన్నారు. గ్రామ సభల్లో గుర్తించిన పనులు మంజూరు కాగానే కూలీలకు పనులు కల్పించాలన్నారు. ఇప్పటి వరకు వెంకటగిరి, డక్కిలి, బాలాయపల్లి, సైదా పురం, రాపూరు, నాయుడుపేట మండలాల్లో షుమారు 32వేల ఎకరాల్లో నిమ్మ మొక్కలు సాగు చేసినట్లు తెలిపారు. రైతుల భూముల్లోని గట్లపై 5,60,000 మొక్కలు పంపకం చేసినట్లు తెలిపారు. ఈ ఏడాది నిమ్మ, మామిడి మొక్కల పెంపకానికి ప్రాధాన్యం ఇస్తున్నట్లు చెప్పారు. ఎస్సీ, ఎస్టీ భూముల్లో ఇందిర జలప్రభ క్రింద సాగునీటి వసతులు కల్పించేందుకు చర్యలు తీసుకోవాలన్నారు. ఈ సమావేశంలో వివిధ మండలాల ఉపాధిహామీ పథకం సిబ్బంది పాల్గొన్నారు.

# అర్హులకు ఓటుహక్కు వుండాలి!

## రాష్ట్ర ఎన్నికల సంఘం పరిశీలకుడు మధు

అర్హులైన ప్రతి ఒక్కరికి ఓటు హక్కు కల్పించాలని రాష్ట్ర ఎన్నికల సంఘం పరిశీలకుడు కె.మధుసూధన్‌రావు అధికారులను ఆదేశించారు. కావలి వచ్చిన ఆయన ఆర్‌డిఓ కార్యాలయంలో అధికారులతో ఓటర్ల నమోదు ప్రక్రియపై సమీక్షించారు. సమాచారాన్నంతా ఆన్‌లైన్‌లో వుంచాలన్నారు. ఒక్క నియోజకవర్గం నుంచి ఆరువేల కొత్తఓట్లు నమోదయ్యాయని, ఇవి ఇంకా పెరిగే అవకాశం వుందన్నారు. కొత్త ఓటర్ల నమోదు ప్రక్రియ సంతృప్తికరంగా వుందన్నారు. ప్రతి జిల్లాలో సంబంధిత అధికారులు, జిల్లా కలెక్టర్‌తో సమీక్షిస్తున్నామన్నారు. ఈ సమావేశంలో ఆర్‌డిఓ సుబ్రహ్మణ్యేశ్వరరెడ్డి, తహశీల్దార్ వెంకటేశ్వర్లు తదితరులు పాల్గొన్నారు.

● కావలి

# రెడ్‌క్రాస్ సేవలకు గుర్తింపు!

## మూడు బంగారు పతకాలిచ్చిన గవర్నర్

కావలి రెడ్‌క్రాస్ విభాగంలో చేసిన సేవలకు ప్రభుత్వ గుర్తింపు లభించింది. రెడ్‌క్రాస్‌ను విస్తరించి ప్రజలకు చేరువ చేయడంలో, వివిధ సేవా కార్యక్రమాలు నిర్వహించడంలో మొదటి నుంచి కావలికి ప్రత్యేకత వుంది. గతంలో ఆర్‌డిఓగా పని చేసిన వెంకటేశ్వరరెడ్డి, ప్రస్తుత ఆర్‌డిఓ సుబ్రహ్మణ్యేశ్వరరెడ్డి, డిప్యూటి ఎమ్మార్వో శ్రీనివాస్‌లు విశేష కృషి చేస్తున్నారు. వీరి సేవ లను గుర్తించి ఇటీవల హైదరాబాద్‌లో జరిగిన కార్యక్ర మంలో గవర్నర్ నరసింహన్ వీరి ముగ్గురికి బంగారు పత కాలు అందజేశారు. రెడ్‌క్రాస్ సభ్యుల సమిష్టి కృషి, ప్రజల సహాయ సహకారాలతోనే ఇంతటి గుర్తింపు లభించిందని వీరు ముగ్గురు వినయంగా తెలిపారు.

# మరుగుదొడ్ల ఆవశ్యకతను చెప్పండి!

## బోగోలు ఎమ్పీడిఓ కనకదుర్గా భవానీ

గ్రామాల్లో మరుగుదొడ్ల నిర్మాణంపై ప్రజలకు అవగాహన కల్పించాలని బోగోలు మండల ప్రజాపరిషత్ అభివృద్ధి అధికారిణి కనకదుర్గా భవానీ అధికారులకు సూచించారు. నిర్మల్ భారత్ అభియాన్ క్రింద నిర్మితమవుతున్న మరుగుదొడ్ల పథకంపై అవగాహన సదస్సు ఇటీవల జరిగింది. ఈ కార్యక్రమంలో పాల్గొన్న ఆమె మాట్లాడుతూ మండలంలో ఐదు పంచాయితీలను మండల నిర్మాణానికి ఎంపిక చేసినట్లు ఆమె తెలిపారు. త్వరలో మిగతా పంచాయితీల్లోను ఈ పథకం అమలవుతుందని, ఈ పథకం గురించి, వ్యక్తిగత మరుగుదొడ్ల అవసరాన్ని గురించి ప్రజల్లో అవగాహన కల్పించాలన్నారు. మండల ప్రజలు ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలని సూచించారు. ఈ సమావేశంలో ఇందిరా క్రాంతిపథం ఏరియా కోఆర్డినేటర్ సింహాద్రిరావు, ఆర్‌డబ్ల్యుఎస్ ఎఇ శ్రీనివాసులు, మండల విద్యాశాఖాధికారిణి శైలజ, ఉపాధిహామీ పథకం ఏపిఓ శ్రీనివాసులు తదితరులు పాల్గొన్నారు.

● చేజర్ల హైస్కూల్

# స్వర్ణోత్సవాలకు రాజకీయ గ్రహణం!

పూర్వ విద్యార్థులు చేయతలపెట్టిన చేజర్ల హైస్కూల్ స్వర్ణోత్సవాలకు రాజకీయ గ్రహణం పట్టింది. తాము చదువుకొన్న పాఠశాలకు 50 ఏళ్లు పూర్తయిన సందర్భంగా ఉత్సవాలను ఘనంగా నిర్వహించాలని అనుకొన్న విద్యార్థుల ఆశలకు రాజకీయాలు నీళ్లు చిలకరిస్తున్నాయి. ముఖ్యంగా ఆనం రామనారాయణరెడ్డి, మాజీ శాసనసభ్యుడు కొమ్మి లక్ష్మయ్యనాయుడుల మధ్య వున్న విభేదాలు ఈ కార్యక్రమాలపై పడుతుండడంతో పూర్వ విద్యార్థులు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. డిసెంబర్ 8,9 తేదీలలో ఈ వేడుకలు జరపాలని నిర్ణయించి అందుకు ఏడు లక్షల రూపాయలు ఖర్చువుతుందని లెక్క కట్టి ఆ మొత్తాన్ని సమకూర్చుకొనే పనిలో పడ్డారు పూర్వ విద్యార్థులు. ఈ కార్యక్రమాలకు ముఖ్యఅతిథులుగా ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి, ఎమ్మెల్సీ విఠపు బాలసుబ్రహ్మణ్యం, జిల్లా కలెక్టర్, ఎస్పీతోపాటు మాజీ ఎమ్మెల్యే కొమ్మి లక్ష్మయ్యనాయుడును ఆహ్వానించదలచారు. ఇక్కడే సమస్య వచ్చి పడింది. ఈ వేడుకలకు ఆనంను పిలవడాన్ని జీర్ణించుకోలేని కొమ్మి దీనిపై ఆగ్రహం వ్యక్తం చేశారట. మంత్రి వస్తే తాను రానని చెప్పడంతోపాటు కమిటీని రద్దు చేయాలని హుకుం జారీ చేశాడట. దీంతో పూర్వ విద్యార్థులు తాత్కాలికంగా ఈ కార్యక్రమాన్ని వాయిదా వేసుకొనేందుకు నిర్ణయించారు. మరికొందరు విద్యార్థులు మాత్రం ఎవరితోనూ సంబంధం లేకుండా ఈ కార్యక్రమాన్ని డిసెంబర్ నెల చివరిలో జరిపేందుకు సమయత్తం అవుతున్నారు. ఈ వివాదం మండలంలో చర్చనీయాంశమయ్యింది.

**రామనారాయణరెడ్డి వస్తే తాను రానన్న కొమ్మి**



ఒంగోలు మాజీ ఎమ్పీ మాగుంట సుబ్బరామరెడ్డి 17వ వర్థంతి సందర్భంగా రంగనాయకులపేటలోని రాఘవ కళ్యాణ మండపంలో ఆయన చిత్రపటం వద్ద నివాళులర్పిస్తున్న అభిమానులు.

# ఆర్టీసి కార్మికుల హక్కులు కాలరాస్తున్నారు!

## కావలి డిపో వద్ద నిరసనకు దిగిన కార్మికులు

కార్మికుల హక్కులను కాలరాస్తున్న ఆర్టీసి యాజమాన్యం తిరిగి నష్టాలకు వారినే బాధ్యులను చేయడంపై పలువురు యూనియన్ నేతలు మండిపడ్డారు. ఎంప్లాయిస్ యూనియన్ ఆధ్వర్యంలో కావలి ఆర్టీసి డిపో వద్ద ఇటీవల సమావేశం జరిగింది. ఈ కార్యక్రమానికి ముఖ్యఅతిథిగా హాజరైన యూనియన్ గౌరవాధ్యక్షుడు, టిడిపి నేత ఆత్మకూరి బ్రహ్మయ్య మాట్లాడుతూ యాజమాన్యాలు కార్మికులపై కక్ష సాధింపు చర్యలకు పాల్పడుతున్నాయన్నారు. ఒకవైపు కార్మికుల హక్కులను హరించివేస్తూ, మరోవైపు వారిపైనే విమర్శలు చేయడం ఎంతవరకు సమంజసమని ప్రశ్నించారు. సంస్థ నష్టాలకు కార్మికులు కారణమని ఆరోపించడం పట్ల ఆగ్రహం వ్యక్తం చేశారు. కార్మికులందరూ సంఘటితమైన హక్కులను కాపాడుకోవాల్సిన అవసరం వుందన్నారు. రాష్ట్ర కార్యదర్శి పెద్దన్న మాట్లాడుతూ రాష్ట్రప్రభుత్వం కార్మికుల పట్ల పక్షపాత ధోరణి అవలంభిస్తోందని విమర్శించారు. ఈ సమావేశంలో యూనియన్ నేతలు నారాయణ, బాబు, బాబుసాహెబ్ తదితరులు పాల్గొన్నారు.

# ప్రాథమిక విద్యను నిర్వీర్యం చేస్తున్న ప్రభుత్వం!

## ఎమ్మెల్సీ బాలసుబ్రహ్మణ్యం ఆవేదన



ప్రభుత్వం పాఠశాలల పట్ల నిర్లక్ష్యంగా వ్యవహరిస్తుండడంతో ప్రాథమిక విద్య నిర్వీర్యం అవుతోందని శాసనమండలి సభ్యుడు విఠపు బాలసుబ్రహ్మణ్యం ఆవేదన వ్యక్తం చేశారు. విడవలూరు మండలం వావిళ్ల జిల్లా పరిషత్ పాఠశాలలో ఇటీవల జరిగిన చెకుముకి సైన్సు సంబరాలలో ఆయన పాల్గొని ప్రసంగించారు. పాఠశాల స్థాయిలో విద్యార్థులు, ఉపాధ్యాయులు వున్నా ప్రభుత్వం నుంచి సహకారం అందకపోతుండడంతో ప్రాథమిక పాఠశాలలు నిర్లక్ష్యానికి గురౌతున్నాయన్నారు. ప్రక్క రాష్ట్రాలైన తమిళనాడు, కేరళ, కర్నాటక రాష్ట్రాలలో ప్రాథమిక స్థాయిలో విద్యా ప్రమాణాలు బ్రహ్మాండంగా వున్నాయని, మన రాష్ట్రంలో మాత్రం విద్యా ప్రమాణాలు నానాటికి దిగజారిపోతున్నాయన్నారు. ఈ విషయమై ఇటీవల ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డిని కలసి ప్రాథమికాభివృద్ధికి చర్యలు తీసుకోవాలని కోరామన్నారు. ప్రతి మండలంలో 20 మోడల్ ప్రాథమిక పాఠశాలలు ఏర్పాటు చేయాలని సూచించామన్నారు. జనవిజ్ఞాన వేదిక ఆధ్వర్యంలో ఇటీవల రాష్ట్రవ్యాప్తంగా చెకుముకి టాలెంట్ టెస్టు నిర్వహించగా దాదాపు 8లక్షల మంది విద్యార్థులు పాల్గొన్నారని తెలిపారు. వీటిలో గ్రామీణ విద్యార్థులు కార్పొరేట్ విద్యార్థుల కంటే మెరుగైన ఫలితాలు సాధించారన్నారు. ఈ కార్యక్రమంలో జనవిజ్ఞాన వేదిక రాష్ట్ర కార్యదర్శి శంకరయ్య, రాధిక ప్రసాద్, నారాయణరెడ్డి, కృష్ణారెడ్డి, బుజ్జయ్య తదితరులు పాల్గొన్నారు.

# అసెంబ్లీకే పోటీ చేస్తా!

## కావలి ఎమ్మెల్యే మస్తాన్‌రావు స్పష్టీకరణ



శాసనసభ్యుడిగా కొనసాగేందుకే ఇష్టపడుతున్నాను తప్ప పార్లమెంటు బరిలో పోటీకి నిలవడం తనకు ఇష్టం లేదని కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు స్పష్టం చేశారు. 2014లో జరిగే ఎన్నికల్లో పార్లమెంటు అభ్యర్థిగా వుంటారనే ప్రచారం జరుగుతుండడంపై ఆయన వివరణ ఇచ్చారు. వచ్చే ఎన్నికల్లోను శాసనసభకే పోటీ చేస్తాను తప్ప, పార్లమెంటుకు పోటీ చేయనున్నట్లు జరుగుతున్న ప్రచారంలో నిజం లేదన్నారు. దీనిపై అధిష్టానం తనతో మాట్లాడినట్లు వస్తున్న వార్తలను ఆయన కొట్టి పారేశారు. ఎన్నికలు నిర్ణీత గడువు ప్రకారం 2014లో వచ్చినా, ముందు జరిగినా తాను మాత్రం శాసనసభకే పోటీ చేస్తానని ఇందులో ఎలాంటి ఊహాగానాలకు, అనుమానాలకు తావులేదన్నారు. కావలి నియోజకవర్గ అభివృద్ధికి తనవంతు కృషి చేస్తున్నానని, ఇంకా చేయాల్సింది ఎంతో వుందన్నారు. ఇతర పార్టీల నేతలతో సఖ్యతగా వుండడం తప్పుకాదని, రాజకీయాలు వేరు అభివృద్ధి కార్యక్రమాలు వేరన్నారు. పేద ప్రజలకు ప్రభుత్వ పథకాలు సక్రమంగా అందేలా చూడడం, ప్రజలకు సేవ చేయడంలోనే తృప్తి వుందన్నారు.

● ఇందుకూరుపేటలో

# బాల్య వివాహం!

● వరుడు ప్రభుత్వ ఉపాధ్యాయుడు

బాల్యవివాహాలను ప్రభుత్వం నిషేధించినా, చట్టం చేసినా ఇంకా ఇలాంటివి పునరావృతం అవుతూనే వున్నాయి. ఇందుకూరుపేట మండలం కొత్తూరులో ఇలాంటి ఘటన జరగడం కలకలం రేపింది. ఇందుకూరుపేటకు చెందిన సురేష్‌రావు బోగోలులో ఉపాధ్యాయుడుగా పని చేస్తున్నాడు. ఈ ప్రబుద్ధుడు మేనరికపు సంబంధం కలసి వున్న బుచ్చికి చెందిన 14ఏళ్ల మైనర్ బాలికను వివాహం చేసుకొనేందుకు సిద్ధమయ్యాడు. ఇందుకూరుపేటలో గల సాయిబాబా గుడిలో పెళ్లి ఏర్పాట్లు చేసుకొంటుండగా ఈ బాల్య వివాహంపై పోలీసులకు సమాచారం అందింది. దీంతో పోలీసులు అక్కడకు చేరుకొని పెళ్లి నిలిపివేశారు. మైనర్ బాలికను ఐసిడిఎస్ అధికారులకు అప్పగించారు. బాల్య వివాహానికి సిద్ధపడిన సురేష్‌రావు మాత్రం పరారయ్యాడు. ఐసిడిఎస్ అధికారులు ఆ బాలికను విచారించారు. దీనికి కారణమైన సురేష్‌పై శాఖపరంగా చర్యలు చేపట్టేందుకు జిల్లా విద్యా శాఖాధికారికి సమాచారం అందించారు. బాధ్యాతాయుతమైన ఉపాధ్యాయుడిగా వుంటూ సమాజాన్ని చైతన్య పరచాల్సిన వ్యక్తి ఇలాంటి వాటికి పాల్పడడంపట్ల సర్వత్రా విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. ఇలాంటి వారిపై కఠినంగా వ్యవహరించాలని మండల ప్రజలు కోరుకొంటున్నారు.

# సమాచారహక్కు పట్ల చైతన్యం పెరిగింది!

## కావలిలో కమిషన్ కార్యదర్శి బివి.సుధాకర్

అందరికి న్యాయం జరగాలని, ఉపయోగకరంగా వుండాలన్న ఉద్దేశంతోనే సమాచార హక్కు చట్టం వచ్చిందని సమాచార హక్కు చట్టం కమిషన్ కార్యదర్శి బివి.సుధాకర్ తెలిపారు. ఇటీవల కావలి వచ్చిన ఆయన స్థానిక ఆర్అండ్‌బి అతిథి గృహంలో అధికారులతో సమావేశమయ్యారు. చట్టం అమలు తీరుపై వివిధ శాఖల వారితో చర్చించారు. సమాచారాన్ని బహిరంగ పరచాలన్నదే ఈ చట్టం ఏర్పాటులో ముఖ్య ఉద్దేశమన్నారు. ఎవరైనా సమాచారాన్ని కోరినపుడు సాకులు చెప్పకుండా అందుబాటులో వున్న సమాచారాన్ని విధిగా అందించాలని అధికారులకు సూచించారు. ఈ చట్టాన్ని మరింత పటిష్టపరచేందుకు చర్యలు తీసుకుంటున్నామన్నారు. సిబ్బంది కొరత, నిధుల కొరత వుందని, దీనిపై ప్రభుత్వానికి ప్రతిపాదనలు పంపామన్నారు. ప్రభుత్వం ఎవరికోసమైతే పని చేస్తుందో వారు ఈ హక్కును పూర్తిగా వినియోగించుకొనే అవకాశం కల్పించాలన్నారు. గత ఏడాది తొమ్మిది వేల దరఖాస్తులు రాగా, ఈ ఏడాది ఇప్పటివరకు 14వేల దరఖాస్తులు వచ్చాయన్నారు. ఇది ఆర్టీఐ పట్ల ప్రజల్లో పెరిగిన చైతన్యానికి నిదర్శనం అన్నారు.

● గిరిజనుల ఇళ్లకు

# బీద సిమెంటు, స్టీల్!

## బిఎంఆర్ ట్రస్ట్ ద్వారా చేయూత



ఇళ్ల నిర్మాణానికి స్టీల్‌ను అందజేస్తున్న కావలి ఎమ్మెల్యే మస్తాన్‌రావు.

కావలి పట్టణంలో గల కొనదిన్నె గిరిజన కాలనీని దత్తత తీసుకొని అభివృద్ధి చేస్తానని శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు హామీ ఇచ్చారు. ఈ ప్రాంతంలో లబ్ధిదారులు నిర్మించుకొంటున్న ఇందిరమ్మ గృహాలకు శ్లాబ్ వేసుకొనేందుకు అవసరమైన స్టీల్‌ను, సిమెంటును బిఎంఆర్ ట్రస్టు తరపున అందజేశారు. ఈ కాలనీలో గల గిరిజనులకు మొత్తం 106 గృహాలు మంజూరు కాగా ప్రతి లబ్ధిదారునికి 14టన్నుల స్టీల్‌ను, 10 సిమెంట్ బస్తాలను సొంత నిధుల నుంచి ఇచ్చి దాతృత్వాన్ని చాటుకొన్నారు. ఈ సందర్భంగా బీద మస్తాన్‌రావు మాట్లాడుతూ ప్రభుత్వం ఒక్కో ఇంటికి 81వేల రూపాయలు అందజేస్తుండగా, తనవంతు సహాయంగా సిమెంటు, స్టీల్ ఇచ్చానన్నారు. మునిసిపాలిటీలో వసూలు అవుతున్న పన్నుల్లో ఆరుశాతాన్ని గిరిజన కాలనీల అభివృద్ధికి కేటాయించనున్నట్లు తెలిపారు. స్టీల్, సిమెంట్‌రేట్లు పెరిగి వున్న నేపథ్యంలో ఉచితంగా వాటిని అందజేసి శ్లాబ్ వేసుకొనేందుకు సహకారం అందించడం పట్ల గిరిజనులు ఆయనకు కృతజ్ఞతలు తెలిపారు. ఈ కార్యక్రమంలో తెలుగుదేశం పార్టీ నాయకులు వేణుగోపాల్, బాషా తదితరులు పాల్గొన్నారు.

# కోవూరును వీడే ప్రశ్నే లేదు!



ఎట్టి పరిస్థితుల్లోనూ కోవూరు నియోజకవర్గాన్ని వీడే ప్రసక్తేలేదని శాసనసభ్యుడు నల్లపురెడ్డి ప్రసన్న కుమార్‌రెడ్డి స్పష్టం చేశారు. ఇటీవల కొడవలూరు మండలంలో పర్యటించిన ఆయన మాట్లాడుతూ కొందరు కావాలని పనిగట్టుకొని తాను నియోజకవర్గం మారుతున్నట్లు దుష్ప్రచారం చేస్తున్నారన్నారు. ఇది అవాస్తవమని ఖండించిన ఆయన ఎట్టి పరిస్థితుల్లోనూ కోవూరును వీడే ప్రసక్తే లేదన్నారు. వచ్చే ఎన్నికల్లోనూ కోవూరు నుంచే వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ తరపున పోటీ చేస్తానన్నారు. 2013లో ఎన్నికలు రానున్నాయని జోస్యం చెప్పిన ప్రసన్నకుమార్‌రెడ్డి వైఎస్ జగన్ ముఖ్యమంత్రి కావడం తథ్యమన్నారు. చంద్రబాబు నాయుడుకు ఇక రాజకీయంగా మనుగడ లేదని, ఆయన రాజకీయ చరిత్ర ముగిసిపోయిందన్నారు. అనంతరం మండలంలో గల వెంకన్నపురంలో వెంకటేశ్వరస్వామి ఆలయంలో పూజలు నిర్వహించారు. ఈ కార్యక్రమంలో వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ నాయకులు చలపతి, శేషయ్య, సూర్యనారాయణ, వెంకటేశ్వరరెడ్డి, రవికుమార్, అజయ్‌బాబు తదితరులు పాల్గొన్నారు.

# బ్యాంక్ లింకేజి రుణాలపై దృష్టి సారించండి!

కార్పొరేషన్, మునిసిపాలిటీల పరిధిలోగల స్వయం సహాయక గ్రూపులను బలోపేతం చేయాలని అందుకోసం వారికి నిర్దేశించిన బ్యాంక్ లింకేజి రుణాలపై ప్రత్యేక దృష్టి సారించాలని జిల్లా కలెక్టర్ శ్రీధర్ అధికారులకు సూచించారు. జిల్లాస్థాయి బ్యాంకర్ల వర్క్‌షాపు ఇటీవల గోల్డెన్ జూబ్లీహాలులో జరిగింది. ఇందులో పాల్గొన్న కలెక్టర్ అధికారులకు పలు సూచనలు చేశారు. స్వయం సహాయక గ్రూపులకు రుణాలు అందజేయడమేకాక వారికి ఆర్థిక ప్రయోజనం కలిగేలా స్వయం ఉపాధిపై శిక్షణా కార్యక్రమాలు నిర్వహించాలన్నారు. వారు తయారు చేసే ఉత్పత్తులకు మార్కెటింగ్ అవకాశాలు కల్పించాల్సిన బాధ్యత మున్సిపల్ కమిషనర్లపై వుందన్నారు. 2012-2013 ఆర్థిక సంవత్సరంలో పట్టణ స్వయం ఉపాధి పథకం, పట్టణ మహిళా స్వయం ఉపాధిపథకం క్రింద ఎంపికైన లబ్ధిదారులకు రుణాలు మంజూరు చేయడమే కాకుండా యూనిట్లను పూర్తిస్థాయిలో గ్రేడింగ్ జరిగేలా చూడాలన్నారు. బ్యాంక్ అధికారులు, మెప్మా సిబ్బంది సమన్వయంతో పని చేయాలని సూచించారు.

# రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి పాదయాత్ర!



కావలి కాలువ క్రింద సాగు చేసే రైతాంగానికి సాగు నీరు అందేలా చూడడమే తమ పాదయాత్ర ముఖ్య ఉద్దేశమని వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ కావలి నియోజకవర్గ ఇన్‌చార్జి రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి స్పష్టం చేశారు. డిసెంబర్ 12 నుంచి రైతుల కోసం మూడురోజులపాటు ఈ పాదయాత్ర జరుగుతుందన్నారు. రుద్రకోట గ్రామం నుంచి ప్రారంభమయ్యే పాదయాత్ర మద్దూరుపాడు, కావలి, ముసునూరు, గౌరవరం, కడనూతల, బోగోలు, కాట్రాయపాడు మీదుగా చివరి ఆయకట్టు వరకు సాగుతుందన్నారు. కావలి కాలువ క్రింద లక్షా 75 వేల ఎకరాల్లో రైతులు సాగు చేస్తున్నారన్నారు. సోమశిల నుంచి సంగం మీదుగా కావలి కాలువకు నీరు చేరుతుందన్నారు. అయితే కాలువ లెవలింగ్ సక్రమంగా లేకపోవడం, పూడిక తీయకపోవడం వలన నీటి సరఫరా సరిగ్గా జరగడం లేదన్నారు. దీనివలన ఈ నీటిపై ఆధారపడి పంటలు సాగు చేసే రైతాంగం తీవ్ర ఇబ్బందులు పడాల్సి వస్తోందన్నారు. దివంగత వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ముఖ్యమంత్రిగా వున్నకాలంలో కావలి కాలువ సమస్యను పరిష్కరించేందుకు ఆధునీకరణకు పూనుకొన్నారన్నారు. ఆయన మరణంతో ఆ పనులకు బ్రేక్ పడిందన్నారు. ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి దృష్టికి రైతులు ఈ సమస్యను తీసుకొనిపోయినా ఆయన ఏమాత్రం పట్టించుకోలేదని విమర్శించారు. ప్రజాప్రతినిధులు, అధికారులు కళ్లు తెరపించి రైతుల ప్రయోజనాలు కాపాడేందుకు ఈ పాదయాత్ర చేస్తున్నట్లు తెలిపారు. అప్పటికీ వీరు పట్టించుకోకపోతే వైఎస్ఆర్ పార్టీ అధికారంలోకి వచ్చిన వెంటనే సమస్యను పరిష్కరిస్తామన్నారు. రైతులు, ప్రజలు పాదయాత్రలో పాల్గొని జయప్రదం చేయాలని పిలుపునిచ్చారు.



మాజీ ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్ధన్‌రెడ్డి బావమర్ది మేదా కృష్ణారెడ్డి కుమారుడు సాత్విక్‌రెడ్డి, నెల్లూరులో పద్మావతి మోటార్స్ నిర్వాహకుడు రమేష్‌బాబురెడ్డి కుమార్తె పూజారెడ్డిల వివాహం నవంబర్ 25వ తేది నెల్లూరులోని ఎం.ఎస్.ఆర్ కళ్యాణ మండపంలో జరిగింది.



నెల్లూరు పొగతోటలోని వెంకటరమణ హోటల్ నిర్వాహకుడు చక్కా మాల్యాద్రి కుమారుడు మనోజ్‌కుమార్, శరణ్యల వివాహం నవంబరు 8వ తేది మినీబైపాస్‌రోడ్డులోని పరమేశ్వరి కళ్యాణ మండపంలో జరిగింది.



నెల్లూరులోని న్యూ ఆధునిక్ ఆప్టికల్స్ నిర్వాహకుడు కరమలపూటి సురేష్‌బాబు కుమార్తె స్నేహ, కృష్ణ సిద్దార్ధల వివాహం నవంబర్ 29వ తేది దర్గామిట్టలోని స్వర్ణవేదిక కళ్యాణ మండపంలో జరిగింది.

# ఎర్రచందనం దుంగలు స్వాధీనం

ఎర్రచందనం అక్రమ రవాణాకు స్మగ్లర్లు పలురకాల మార్గాలను అన్వేషిస్తున్నారు. బియ్యం, అరటిగెలలు, ఇసుకలోడ్‌ల మధ్య చందనాన్ని వుంచి రవాణా చేస్తున్న వీరు తాజాగా ఎర్రగడ్డల లారీలో వేసి తరలిస్తుండగా కావలిలో అధికారులు పట్టుకొన్నారు. రూరల్ మండలం గౌరవరం డాబాల వద్ద ఎర్రచందనం దుంగలతో లారీ వెళ్తున్నాదన్న సమాచారం అందుకొన్న ఫారెస్టు అధికారులు తనిఖీ చేపట్టగా ఎర్రగడ్డల బస్తాల క్రింద దాచి వుంచిన 94 ఎర్ర చందనం దుంగలు బయట పడ్డాయి. వాటిని స్వాధీనం చేసుకొన్నారు. వీటి విలువ 15 లక్షల రూపాయలకుపైగా వుంటుందని అధికారులు తెలిపారు. ఈ దాడిలో ఫారెస్టు అధికారులు వెంకటసుబ్బయ్య, నాగభూషణం, ఖాజారంతుల్లా, శేషయ్య పాల్గొన్నారు.

# ప్రదక్షిణం వెనుక ఎన్నో పరమార్థాలు!



దైవ దర్శనానికి వెళ్లినపుడు గుడిచుట్టూ ప్రదక్షిణలు చేయడం మన సాంప్రదాయం. ఇలా ప్రదక్షిణలు చేయడం వల్ల పాపాలన్నీ నశిస్తాయని విశ్వాసం. ప్రదక్షిణ అనే పదానికి అర్థం తిరగడం. చారచర జగత్తులో చైతన్య శక్తి నిత్యం పరిభ్రమిస్తూనే వుంటుంది. సూర్యుని చుట్టూ అనేక గ్రహాలు నిత్యం తిరుగుతూ అనంతశక్తిని గ్రహిస్తుంటాయి. దీనిని సూర్యుని నుంచి శక్తిని గ్రహించే ప్రదక్షిణ అని చెప్పొచ్చు. విశ్వంలోని ప్రతి అణువు ప్రకృతి అనే పరమాత్మను కేంద్రంగా చేసుకొని ఆయన ఇచ్చిన శక్తితోనే పరిభ్రమిస్తూ వుంటుంది. ఈ ప్రకారంగానే ఆలయంలో వున్న దైవం విశ్వశక్తి కేంద్ర బిందువునకు ప్రతీక. ఆయన చుట్టూ వున్న ఆలయం ఆనంత విశ్వానికి సంకేతం. ప్రపంచంలో జరిగే పరిణామాలే ప్రదక్షిణలు. జననం నుంచి మరణం వరకు విశ్వంలో మానవ జీవితమే ఒక ప్రదక్షిణ. ఎన్నో జన్మల కర్మ ఫలితాన్ని ఈ జన్మలో అనుభవిస్తారని చెప్తుంటారు. ప్రదక్షిణ పేరుతో పరమాత్ముని చుట్టూ తిరగడం వలన కర్మల దుష్ఫలితాలను తొలగించుకోవచ్చని శాస్త్ర వచనం.

సమస్తకోటికి వెలుగు రేఖలను ప్రసాదించే ప్రత్యక్ష నారాయణుడైన సూర్యభగవానుని నుంచి గ్రహాలు కొత్త శక్తిని గ్రహించినట్లే దేవాలయాల్లో వున్న దైవశక్తిని పొందడానికి ఎడమవైపు నుంచి కుడివైపుకు తిరుగుతూ భక్తి పూర్వకంగా ప్రదక్షిణలు చేస్తారు. సూర్యుని చుట్టూ తిరిగే గ్రహాల్లో కూడా కొన్ని గ్రహాలు తమ చుట్టూ తాము తిరుగుతూ సూర్యుని చుట్టూ తిరిగినట్లే మనము ఆలయాల్లో దేవుని చుట్టూ తిరగడంతోపాటు పూజల సందర్భంలో గృహాల్లో మన చుట్టూ మనం తిరుగుతాము. దీనినే ఆత్మ ప్రదక్షిణ అంటారు. మనలో వున్న పరమాత్మని గుర్తించి ఆయనకు చేసే ప్రదక్షిణమే ఆత్మ ప్రదక్షిణం. ఆలయాల్లో చేసే ప్రదక్షిణలు పలు రకాలులున్నాయి. ధ్వజ స్తంభం బ్రహ్మకు ప్రతీక. అందుకే ధ్వజ స్తంభం వున్నవన్నీ ఆలయాలవుతాయి. అవి లేనివి కేవలం మందిరాలవుతాయి. ప్రదక్షిణ చేసే సమయంలో ధ్వజస్తంభాన్ని కలుపుకొని ప్రదక్షిణ చేయాలి. ఈ ప్రదక్షిణలు కేవలం గుడి, ఆత్మలకే కాకుండా తల్లిదండ్రులకి, గోవుకి, రావి, వేపచెట్టు కలసి వున్న చోట చేస్తారు. వివాహ సమయంలో అగ్నికి చేస్తారు. భగవాన్ రమణ మహర్షి ప్రదక్షిణ అనే పదాన్ని విశ్లేషించారు. ప్ర అనే అక్షరం సమస్త పాపాల వినాశనానికి సూచకమని, ద అంటే కోరికలన్ని తీరడమని, క్షి అన్న వర్ణం రాబోయే జన్మల క్షయాన్ని సూచిస్తుందని, ణ అనగా అజ్ఞానం నుంచి విముక్తి ప్రాప్తించడం అని చెప్పారు. అన్ని ప్రదక్షిణలు కన్నా మాతృమూర్తికి చేసే పాదాభివందనం కార్తీక స్నానాలు, మాఘస్నానాలు, కాశీయాత్రల కంటే గొప్పదని శాస్త్రాలు చెబుతున్నాయి.




ప్రదక్షిణ చేసే సమయంలో అలసట లేకుండా, ఏకాగ్రతతో స్థిరచిత్తంతో అడుగులో అడుగు వేసుకొంటూ నిదానంగా నడవాలని ప్రదక్షిణ సూత్రం విశదీకరిస్తుంది. ప్రదక్షిణలో ఎంత నిదానం వుంటే అంత ఎక్కువ ఫలితాలనిస్తుందని చెప్తారు. అడుగులో అడుగు వేసుకొంటూ నమస్కరిస్తు హృదయంలో భగవంతుని ధ్యానిస్తూ, వాక్కుతో స్తోత్రం చేస్తూ ప్రదక్షిణ చేయాలి. దీనినే చతురంగ ప్రదక్షిణ అంటారు. విఘ్నేశ్వరుని తల్లిదండ్రులైన పార్వతి పరమేశ్వరుల చుట్టూ ప్రదక్షిణం చేసి సమస్త విశ్వానికి ప్రదక్షిణ చేసినంత ఫలితం పొందాడని పురాణాలు చెప్తున్నాయి. హిందు ధర్మ శాస్త్రాలతోపాటు ఇస్లాంలోను ప్రదక్షిణ సాంప్రదాయం వుంది. హజ్ యాత్రికులు కాబా చుట్టూ ఏడుసార్లు ప్రదక్షిణలు చేస్తారు.

సభలు - సమావేశాలు

# మార్మోగిన మా తెలుగుతల్లికి మల్లెపూదండ గీతం!



నెల్లూరు పోలీసు పెరేడ్ గ్రౌండ్‌లో గీతాలాపన చేస్తున్న విద్యార్థినులు, ఉపాధ్యాయులు.

- సాంప్రదాయ దుస్తుల్లో కలెక్టర్, డిఆర్వో, డిఇఓ.
- వేలాది గొంతులు కలిసి గానం చేయడంతో మళ్లీ మళ్లీ వినాలిపించింది.

నెల్లూరులోని పోలీసుపెరేడ్ గ్రౌండ్‌లో 30వ తేది "మాతెలుగుతల్లికి మల్లెపూదండ" గీతాలాపనతో మార్మోగింది. ప్రపంచ తెలుగు మహాసభలు నిర్వహణ సందర్భంగా రాష్ట్రంలోని అన్ని జిల్లా కేంద్రాల్లో తెలుగుభాష విశిష్టత గురించి ప్రత్యేక కార్యక్రమాన్ని నిర్వహించాలని ప్రభుత్వం ఆదేశించింది. దీంతో జిల్లా విద్యాశాఖ ఆధ్వర్యంలో వివిధ పాఠశాలలు, కళాశాలల విద్యార్థులతో మా తెలుగుతల్లికి మల్లెపూదండ గీతాన్ని ఆలపించారు. జిల్లా కలెక్టర్ శ్రీధర్, డిఆర్వో రామిరెడ్డి, డిఇఓ మువ్వా రామలింగం, డిఎంఅండ్‌హెచ్‌ఓ డాక్టర్ మాశిలామణి పలువురు అధికారులు సాంప్రదాయ దుస్తులు ధరించి ఈ కార్యక్రమానికి హాజరైనారు.

10వేల మంది విద్యార్థులతో ఈ కార్యక్రమం నిర్వహించాలని భావించినప్పటికి వివిధ కళాశాలలు, పాఠశాలల నుంచి విద్యార్థులను తీసుకురాలేకపోయారు. ఇటీవల రాష్ట్రప్రభుత్వం తెలుగు భాష అమలుపై శ్రద్ధ చూపడంతోపాటు తిరుపతిలో ప్రపంచ తెలుగుమహాసభలను నిర్వహించాలని నిర్ణయించింది. ప్రభుత్వ కార్యాలయాలు, వ్యాపార సంస్థల పేర్లు అన్ని తెలుగులోనే ఉండాలని ఆదేశాలు జారీ చేయడం జరిగింది. అయితే అధికారయంత్రాంగం ఉదాసీనత కారణంగా ప్రభుత్వశాఖల్లోనే తెలుగుభాష గురించి ప్రసంగిస్తున్న అధికారులు అమలు చేసే విషయంలో ఎందుకో అలసత్వం ప్రదర్శిస్తుంటారు. సాక్షాత్తు ఉన్నతాధికారులే తెలుగు గురించి పట్టించుకోకపోవడంతో క్రిందిస్థాయి ఉద్యోగులు సైతం అదే బాటలో పయనిస్తున్నారు.

### ఆకట్టుకున్న బాలికల నృత్యం

మాతెలుగుతల్లికి మల్లెపూదండ గీతాలాపన సందర్భంగా బాలికలు చేసిన నృత్యం ఎంతగానో ఆకట్టుకుంది. దేశభక్తిని పెంపొందించే విధంగా ఉన్న పాటలకు సాంప్రదాయబద్ధంగా వస్తున్న ఆచారాలను గుర్తు చేసే పాటలకు రూపకల్పన ఆహుతులను అలరింప చేసింది. అందరికి అర్థమయ్యే విధంగా రికార్డు చేయబడిన దేశభక్తి గీతాలను వినిపించారు. గతంలో ప్రభుత్వ కార్యక్రమాల సందర్భంగా దేశభక్తి గీతలతోపాటు సినిమా పాటలను కూడా బాలికల చేత డ్యాన్స్ చేయించేవారు. మా తెలుగు తల్లి మల్లెపూదండ గీతాలాపన కార్యక్రమంలో కేవలం దేశభక్తి, తెలుగుభాష విశిష్టత చాటి చెప్పే గీతాలకే అధికారులు ప్రాధాన్యతనివ్వడం అభినందనీయం.

**మేషం** (అశ్విని, భరణి, కృత్తిక 1 పా)

తలపెట్టిన పనులలో కొన్నింటికి సానుకూలతలున్నా మరికొన్నిటిని వాయిదా వేసుకోక తప్పదు. ఉద్యోగులకు కీర్తి భంగం, విలువ కోల్పో తారు. ప్రయాణాలలో అనుకూలతలు సాధిస్తారు. వ్యవసాయ దారులకు ఆదాయ వ్యయాలు సమానంగా వుంటాయి. కళా, క్రీడా రంగాలవారికి నిత్య పనులు ఆటంకాలు లేకుండా సాగుతాయి. రాజకీయులు అపరిష్కృత వ్యవహారాలలో అనుకూలత సాధిస్తారు.

**వృషభం** (కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా)

పనులలో మిశ్రమ ఫలితాలుంటాయి. కళత్ర ఆరోగ్య జాగ్రత్తలు అవసరం. శరీరశ్రమ, అకాల భోజనం, శస్త్ర చికిత్స అవసరం ఏర్పడ గలదు. వాహన ప్రమాదాలు, అనుకోని సంఘటనలు మనస్తాపాన్ని కలిగిస్తాయి. వృత్తి, వ్యాపార ఆర్థికాదాయాలు సామాన్యం. కళా, క్రీడా రంగాల వారి పరిస్థితులు మెరుగుపడతాయి. రాజకీయులకు ఎన్ని ఇబ్బందులున్నా ఆర్థిక లావాదేవీలు సంతృప్తినిస్తాయి.

**మిథునం** (మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు1,2,3 పా)

ఆర్థిక ఇబ్బందులు తొలగుతాయి. వృత్తి, వ్యాపారాలు కలసి వస్తాయి. ఇంటాబయట కొత్త సమస్యలు రాకుండా జాగ్రత్తలు తీసుకోవాలి. దైవదర్శనాలు చేస్తారు. ప్రయాణాలు కలసి వస్తాయి. విద్యార్థులు ఉత్సాహంగా, నూతన మిత్రులతో సంతోషాలుం టాయి. కళా, క్రీడా రంగాలవారు విమర్శలనెదుర్కొంటారు. సోద రుల మధ్య మైత్రీభావం తగ్గుతుంది.

**కర్కాటకం** (పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష)

అన్ని వర్గాల వారికి బాగుంటుంది. ప్రభుత్వం ద్వారా కావలసిన పనులు అనుకూలిస్తాయి. వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారు ఆర్థి కాభివృద్ధిని సాధిస్తారు. కుటుంబ వ్యక్తుల మధ్య సంతోషాలు, గురు దర్శనం సంతోషాన్నిస్తుంది. అప్పులు ఇవ్వడం, తీసుకోవడం వల్ల ఆర్థిక అసమానతలుంటాయి. విద్యార్థులు అన్య విషయాలపై ధ్యాస పెట్టకుండడం మంచిది. నూతన కార్యక్రమాలు వాయిదా వేయండి.

**సింహం** (మఖ, పుబ్బ ఉత్తర 1 పా)

తలపెట్టిన పనులు సకాలంలో పూర్తి చేస్తారు. నూతన వ్యక్తుల పరి చయం లాభిస్తుంది. వృత్తి, వ్యాపారాలందు లాభాలు. శరీరారో గ్యం, అన్నింటా జయం. సంతానపరంగా, కుటుంబపరంగా ఖర్చు లధికం. కోర్టు వ్యవహారాలు అనుకూలిస్తాయి. పితృవర్గ విభేదాలకు పరిష్కారం చూపుతాయి. ఇంటికి కావలసిన విలువైన వస్తువులు కొంటారు. వ్యవసాయదారులకు ఆర్థికంగా బాగుంటుంది.

**కన్య** (ఉత్తర 2,3,4పా. హస్త, చిత్త 1, 2 పా)

గ్రహానుకూలతల వల్ల చేసే పనులన్నింటిలో విజయం సాధిస్తారు. ఆర్థికాదాయం బాగుంటుంది. వృత్తి, వ్యాపారాలలో రాణింపు, వ్యవ హారానుకూలతలను సాధిస్తారు. కుటుంబంలో సాధారణ సుఖాలు ఏర్పడగలవు. విద్యార్థులకు చదువుపై ప్రత్యేక శ్రద్ధ అవసరం. వ్యవ సాయదారులు అనుకూలతలను సాధిస్తారు. కళా, క్రీడా రంగాల వారికి నూతన పరిచయాలు వారి ఉన్నతస్థితికి అనుకూలిస్తాయి.

# వారఫలాలు

*తేది 8-12-2012 నుండి 14-12-2012 వరకు వృషభంలో గురు, కేతువులు; తులలో శని; శుక్రుడు తులలో 11తేది వరకు తదుపరి వృశ్చికంలో; వృశ్చికంలో రవి, బుధ, రాహువులు; ధనుస్సులో కుజుడు; కన్య, తుల, వృశ్చిక, ధనుస్సులలో చంద్రుడు సంచరిస్తారు.*

## పంచాంగం

9తేది ఉత్థాన ఏకాదశి.

13తేది ప్రతిపామావాస్య - తిథి ద్వయం ( అమావాస్య - శుద్ధ పాడ్యమి), గీతా జయంతి.

15తేది ధనూ సంక్రమణం ప్రారంభం. సఫర్ నెల ప్రారంభం.

### శుభ ముహూర్తాలు

14తేది నుండి మార్గశిర నెల ప్రారంభం. సీమంతం, అన్నప్రాసనాది సామాన్య ముహూర్తాలున్నాయి. వివాహ, గృహప్రారంభ, గృహప్రవేశాలకు సముహూర్తాలు లేవు.

### డిసెంబర్ తిథులు

**కార్తీక బహుళ**

| | | | | |
|---|---|---|---|---|
| 8 | శని | నవమి | ప | 07.47 గం.ల.వ |
| 9 | ఆది | ఏకాదశి | రా | 03.44 గం.ల.వ |
| 10 | సోమ | ద్వాదశి | రా | 12.52 గం.ల.వ |
| 11 | మంగళ | త్రయోదశి | రా | 09.31 గం.ల.వ |
| 12 | బుధ | చతుర్దశి | సా | 05.54 గం.ల.వ |
| 13 | గురు | అమావాస్య | ప | 02.10 గం.ల.వ |
| | | **మార్గశిర శుద్ధ** | | |
| 14 | శుక్ర | పాడ్యమి | ప | 10.29 గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, దొడ్ల సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు - 2. సెల్: 95819 76599.

**తుల** (చిత్త 3,4 పా. స్వాతి, విశాఖ 1,2,3 పా)

తలపెట్టిన నూతన కార్యక్రమాలలో మిశ్రమ ఫలితాలుంటాయి. వృత్తి, వ్యాపారాలు మెల్లగా సాగుతాయి. ఆదాయం పర్వాలేదు. శారీరకంగానూ, మానసికంగానూ ఇబ్బందులు తప్పవు. మాతృ లేదా పితృవంశ సూతకాలు, కుటుంబంలో అసమానతలుం టాయి. విద్యార్థులు తమ విద్యావకాశాలు మెరుగుపరచుకోవాలి. కళా, క్రీడాకారులు ఖర్చులకు తగ్గ ప్రయోజనం పొందలేరు.

**వృశ్చికం** (విశాఖ 4 పా. అనూరాధ, జేష్ఠ)

గ్రహానుకూలతలు లేక ఆర్థికమాంద్యం ఏర్పడగలదు. వృత్తి, వ్యాపా రాలలోని వారికి సామాన్యం. శరీరారోగ్య లోపం, కుటుంబంలో అసౌకర్యాలు పెరగడం వల్ల, ఆర్థిక సర్దుబాట్లు అవసరం. ఉద్యో గులు పై అధికారులకు అనుకూలురై వుండగలరు. అకాల భోజ నం, పిరికితనం, భయం వుంటుంది. నిరుద్యోగులకు ఆశాభంగం. విద్యార్థులకు శరీరశ్రమ అధికంగా వుంటుంది.

**ధనుస్సు** (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా)

చేసే పనులలో అభివృద్ధి కానవస్తున్నా, ఆర్థికంగా మిశ్రమ ఫలితా లుంటాయి. అన్నింటా అయినవారి సహాయ సహకారాలు ఆశిం చండి. అధిక ఖర్చులను అదుపులో వుంచాలి. భూసంబంధ నష్టాలు రావచ్చు. విద్యార్థులకు తోటి విద్యార్థులతో వ్యవహార నష్టాలుం టాయి. వ్యవసాయదారులకు పనులలో అనవసర ఖర్చులుంటాయి. ఉద్యోగులకు తమ పై అధికారుల ఒత్తిడి పెరిగే సూచనలున్నాయి.

**మకరం** (ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)

తలపెట్టిన పనులలో మిశ్రమ ఫలితాలుంటాయి. సాహస కార్యా లకు దూరంగా వుండండి. సరదా విషయాలలో జాగ్రత్త. ప్రతి చిన్న విషయానికీ కోపం, ఇతరులతో దురుసుగా మాట్లాడుట, కొన్ని పను లకు ఆటంకాలు ఏర్పడుతాయి. స్థిరాస్తులపై ఖర్చులుంటాయి. విద్యా ర్థులకు శుభసూచికాలుంటాయి. వ్యవసాయదారులు సానుకూలత సాధిస్తారు. నూతన కార్యాలు వాయిదా వేయడం మంచిది.

**కుంభం** (ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా)

ఈ రాశివారికి అన్నింటా విజయమే. అన్ని వర్గాల ఆదాయాలు పెరుగు తాయి. కుటుంబంలో సుఖశాంతులు. వృత్తి, వ్యాపారాలలో ఆర్థిక లావాదేవీల సంతృప్తి, నూతన వ్యవహారాలకు అనుకూలం. నూతన వస్త్రాభరణాల ప్రాప్తి. విద్యార్థులు పట్టుదలతో ముందుకు సాగాలి. కళా, క్రీడా రంగాలవారు నిలచిన పనులు పూర్తి చేస్తారు. రాజకీ యులు తమ శక్తికి మించిన పనులకు దూరంగా వుండడం మంచిది.

**మీనం** (పూర్వాభాద్ర 4 పా. ఉత్తరాభాద్ర, రేవతి)

గత కొంతకాలంగా ఇబ్బంది పెడుతున్న పనులు, సమస్యలు కొద్దిగా తొలగుతాయి. వృత్తి, వ్యాపారాలు పుంజుకుంటాయి. కుటుంబ సమ స్యలు కొన్ని పరిష్కారమౌతాయి. గృహమార్పులు లేదా కుటుంబంలో వివాహాది వేడుకలు చేపట్టగలరు. ఉద్యోగులకు పై అధికారులకు అను కూలంగా వుండగలరు. విద్యార్థులు తమ విద్యావకాశాలను మెరుగు పరచుకోవాలి. వ్యవసాయదారులు అనుకూలతలను సాధించగలరు.

# బాలికా భ్రూణ హత్యలు, కుటుంబ వ్యవస్థ వినాశన కారకాలు!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*డాక్టర్ వసుంధర — చెన్నై*

** జ్యోతిష శాస్త్రపరంగా భ్రూణ హత్యలకు శిక్షలు లేవా? విచ్చలవిడి అయిపోయాయి కదా?*

ధర్మసింధు, వశిష్ఠ సూత్రం భ్రూణ హంతకులకు 'కుష్ఠు' వ్యాధి ప్రాప్తిస్తుందని, రౌరవ నరకాలు అనుభవిస్తారని చెబుతున్నాయి. ఇవి వ్యవస్థ విచ్ఛిన్నానికి కారణమవుతాయి. పంచ పాండవుల్ని హత మార్చిన అశ్వత్థామ కుష్ఠు వ్యాధిపీడితుడై అడవుల్లో దుర్భర జీవితాన్ని గడిపాడని చరిత్ర చెబుతోంది.

*అల్లం నారాయణరావు — విజయవాడ*

** శనివారం చాలా మంది ఏ పనులూ చేయరు. ఎందువల్ల?*

అది వారి వారి నమ్మకాల మీద ఆధారపడి ఉంటుంది. శనివారం దేవతలకు ప్రీతికరమైన రోజు. మూఢ నమ్మకాల్ని ప్రచారం చేయకండి.

*షేక్ మస్తాన్‌బీ — నెల్లూరు*

** ప్రయాణాల్లో ముగ్గురు వెళ్లకూడదా?*

అసమ, సమ సంఖ్యలకు ఒక్కో చోట ఒక్కో విధంగా ఫలితాలు చెప్పారు. ఇది సామాన్యులు కల్పించిన మూఢ నమ్మకం. శాస్త్రాల్లో ఈ విషయం ఎక్కడా లేదు.

*కె.శారదమ్మ — గూడూరు*

** గృహ సమీప 'స్మశాన స్థలి' దోషాలకు పరిహారం చెబుతారా?*

గృహాలకు ఒకటి, రెండు కిలోమీటర్ల దూరంలో స్మశానాలు ఉండవచ్చు. అంతకు లోపల శాస్త్రం అంగీకరించదు. పిశాచ వేధ, మృత్యువేధలకు నిర్ధారిత 'యంత్ర ప్రతిష్ట' వెంటనే చాలా అవసరం.

*షేక్ తాజ్ — హైదరాబాద్*

** 'పుష్యరాగం' రత్నం వేసుకున్నాక సమస్యలు ఎక్కువయ్యాయి.*

నీలం ప్రథమార్థం ధరించి పుష్యరాగం తీసివేయండి. నవరత్న ఉంగరం వల్ల సమస్యలు ఎక్కువవుతాయి.

*యం.పరశురామయ్య — కోవూరు*

** మా యింటికి దక్షిణంలో పంట కాలువలున్నాయి. ఆమె అనారోగ్యంగా ఉంటుంది.*

గృహ, వ్యాపార నిర్మాణాలకు దక్షిణ, పశ్చిమ దిశల్లో వాపీ, కూప, తటాకాలు సమస్యలను తెస్తాయి. జలదోషం వల్లే మీ ఆవిడకు అనారోగ్యం. శాస్త్ర స్థితిగతుల్ని గణించి వచ్చే యంత్ర ప్రతిష్ట చేసుకోవాలి.

*షేక్ దిల్‌షాన్‌బేగం — నెల్లూరు*

** మంగళవారం పనులు ప్రారంభించ కూడదా?*

'మంగళ'కు శుభప్రదమైన అని అర్థం. శాస్త్రార్థం అంగారక గ్రహం మరో పేరు మంగళ గ్రహం. సమాజంలో విస్తృతంగా వ్రేళ్లూనిన మూఢ నమ్మకాలలో ఇదొకటి.

*ఎం.డి.అలీఘర్‌బాషా — హైదరాబాద్*

** శుక్ర దశ ఆర్థిక సంపదలకు మూలం. ఈ అంశాన్ని గురించి చెప్పండి?*

వాస్తు, జ్యోతిష శాస్త్ర దోషాలున్నప్పటికీ శుక్ర దశ ఉన్నప్పుడు పట్టిందల్లా బంగారం అవుతుంది. ఈ దశ ఇరవై సంవత్సరాలు దాటగానే శాస్త్ర దోషాలు ఆకస్మికంగా దాడి చేస్తాయి.

*డాక్టర్ పరమేశన్ — బెంగుళూరు*

** 'కుంభ జలం' జలదోషం లేనిదిగానూ, రోగ నిదాన విధానంగానూ చెప్పారు.*

'వాస్తునిధి' ప్రాచీన గ్రంథంలో ఈ వివరాలున్నాయి. మట్టి పాత్రలు బాక్టీరియాను పెరగనీయవు. కుండను తూర్పు ఉత్తర ప్రాంతాల్లో పెట్టవచ్చు. ఈశాన్యంలో కాదు.

*షేక్ ఫరీదాబేగం — సికింద్రాబాద్*

** చదువుకూ, రత్నాలకూ సంబంధం ఏమిటి?*

పిల్లలకు వ్యతిరేక గ్రహ దోషాలున్నప్పుడు ఆయా రత్నధారణ వల్ల దోషాలు నివృత్తి అవుతాయి. అందువల్ల ఆ తర్వాత వారు బాగా చదువగలుగుతారు.

*సి.పరంధామయ్య — సూళ్లూరుపేట*

** రిటైర్ అయ్యాక నాకు గృహంలో విలువ తగ్గింది. దీనికి ఏదైనా యంత్రం ఉన్నదా?*

సమాజంలోని మానవుల సంకుచిత మనస్త్వంలోని గుణాలివి. 'గృహదోష చింతామణి'లో ఈ సమస్యకు నాలుగైదు యంత్రాలు చెప్పబడ్డాయి.

# అవినీతిలో ఆరితేలిన కలువాయి ఎస్‌ఐ!

**జిల్లాలోని పోలీస్ స్టేషన్లలో కలువాయి స్టేషన్‌ను ప్రత్యేకంగా చెప్పుకోవాలి. ఇక్కడ పనిచేసే ఎస్‌ఐ మహా అవినీతిపరుని అవతారం ఎత్తాడు. ఈయన అవినీతి గూర్చి చెప్పాలంటే పెద్ద గ్రంథమే వ్రాయాల్సి వస్తుంది.**

కలువాయి పోలీసుస్టేషన్ అవినీతికి నిలయంగా మారిపోయింది. ఇక్కడకు వచ్చి ఫిర్యాదు చేయాలంటేనే ప్రజలు భయపడాల్సిన పరిస్థితి ఏర్పడింది. జిల్లా ఎస్పీ పోలీసుశాఖను మరింత ప్రక్షాళన చేయాలని ఒకప్రక్క ప్రయత్నిస్తుంటే అందుకు భిన్నంగా పోలీసులు ప్రజల నుంచి మామూళ్లు డిమాండ్ చేస్తున్నారు. పోలీసులు మామూళ్లు తీసుకుంటే అవినీతి నిరోధకశాఖకు ఫిర్యాదు చేయాలని పెద్దపెద్ద వాల్‌పోస్టర్లు ప్రతి ప్రభుత్వ కార్యాలయంలో దర్శనమిస్తుంటాయి. అయినప్పటికి వాటితో తమకు ఏమాత్రం సంబంధం లేదని ఇక్కడ పని జరగాలంటే అడిగినంత సొమ్ము చెల్లించుకోక తప్పదంటున్నాడు కలువాయి ఎస్సై. పోలీసు స్టేషన్‌కు వచ్చే ఫిర్యాదు చేసే బాధితులే కాకుండా నిందితుల నుంచి కూడా లంచం డిమాండ్ చేస్తుంటాడు. మరో ఆరు నెలల్లో పదవీవిరమణ చేయబోతున్నానని చెప్పుకొంటూ అక్రమ సంపాదన కోసం వెంపర్లాడుతున్నాడు.

## చిన్న కేసుకూ పదివేలు చెల్లించాలి

ప్రతి చిన్న కేసుకు కూడా కనీసం 10వేలు వసూలు చేయందే వదిలిపెట్టడం లేదు. కాసులు సమర్పిస్తే నిందితులపై క్రిమినల్ కేసుకు బదలు పెట్టీ కేసు నమోదు చేసేస్తాడు. తాను చెప్పిన విధంగా కేసు రాజీ చేసుకోకుంటే కౌంటర్ కేసు పెట్టాల్సి వస్తుందని భయపెడుతుంటాడు. పోలీసులతో ఎందుకొచ్చిన తంటా అనుకుని చాలామంది బాధితులు రాజీ పడేందుకు అంగీకరిస్తున్నారు. ఈ ఎస్సై అక్రమాలపై బాధితులు కోర్టు, లోకాయుక్తకు ఇప్పటికే ఫిర్యాదు చేసి వున్నారు. స్టేషన్‌లో రోజువారీ కలెక్షన్ తగ్గిందని భావిస్తే చాలు వెంటనే రోడ్డుపైకి వచ్చి వాహనాల తనిఖీ అంటూ ఊరి చివరన కాపు కాస్తాడు. రోడ్డుపై వెళ్లే ప్రతి వాహనాన్ని నిలిపి ఏదో ఒక కారణం చూపి వాహన చోదకుల నుంచి రుసుం వసూలు చేసి జేబులో వేసుకుంటాడు. వాహన చోదకుల నుంచి వసూలు చేయబడిన జరిమానాకు రశీదు ఇవ్వమని ఎవరైనా అడిగితే వారిపట్ల దురుసుగా వ్యవహరిస్తుంటాడు.

## కౌంటర్ కేసుల వ్యాపారం

కలువాయి బజారు సెంటర్‌లో ఇద్దరు వ్యాపారులు గొడవపడి ఒకరు పోలీసులకు ఫిర్యాదు చేయడం జరిగింది. ఇందులో ఎస్‌ఐ చాలా తెలివిగా వ్యవహరించి కౌంటర్ కేసు తీసుకుని ఫిర్యాదుదారుని బెదిరించి రాజీచేసి 10వేలు దండుకొన్నాడు. తెలుగురాయపురం గ్రామంలో ఓ వ్యక్తికి చెందిన పొలంలోని మోటార్లు అక్కడి బోరుబావిలో చోరీ చేసిన వారు పడేశారు. ఈ కేసుకు సంబంధించి నిందితుడి వద్ద 10వేలు పుచ్చుకొని కేసు నమోదు చేయలేదు. దీంతో బాధితుడు డిఎస్పీని ఆశ్రయించాడు. డిఎస్పీ ఎస్‌ఐని గట్టిగా మందలించడంతో కేసు నమోదు చేసేందుకు ఫిర్యాదుదారుడి వద్ద 5వేలు డిమాండ్ చేసి తీసుకున్నాడట. కేశవనేనిపల్లెకు చెందిన గార్ల వెంకటేశ్వర్లు తన పొలంలోకి క్వారీ నుంచి రాయిని అదే గ్రామానికి చెందిన నారాయణ అనే వ్యక్తి ట్రాక్టర్‌తో తరలించుక వెళ్లాడంటూ కేసు పెట్టాడు. క్వారి నుంచి కంకరను తీసుకెళుతున్న ట్రాక్టరును పట్టుకున్న ఎస్‌ఐ నారాయణ వద్ద 30వేలు తీసుకొని వదిలేశాడు.

ఫిర్యాదుదారుడు జిల్లా మంత్రి అన్నగారైన నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డిని ఆశ్రయించడంతో ఎస్‌ఐకు ఎమ్మెల్యే నుంచి గట్టిగా డోస్ పడడంతో క్షణాల్లో కంకరతో వున్న ట్రాక్టర్ స్టేషన్ ముందు ప్రత్యక్షమైంది. నిందితుడిపై నాన్ బెయిల్‌బుల్ కేసు పెట్టాడు. నారాయణ ఆచూకీ తెలియక పోవడం, మరోప్రక్క రాజకీయంగా ఒత్తిడి రావడంతో ఏ సంబంధంలేని నిందితుడి స్నేహితుడు వెంకటరత్నంను విచారణ పేరుతో రెండు రోజులపాటు పొదలకూరు సిఐ కార్యాలయంలో నిర్బంధించి వేధించారు. సమాచారం రాకపోవడంతో అక్రమ కేసు బనాయించి కోర్టులో హాజరుపరిచినట్లు తెలిసింది. ఈ కేసులో బాధితులు మానవహక్కుల కమిషన్ ఆశ్రయించినట్లు తెలిసింది. ముందుగా హెచ్చరించినప్పటికి మామూళ్లు ఇవ్వలేదన్న కోపంతో టపాసులు విక్రయించేందుకు లైసెన్స్‌లేని ఇద్దరు వ్యాపారుల ఇళ్లలో గత సంవత్సరం విక్రయించి మిగిలిన టపాసులు స్వాధీనం చేసుకొని ప్రేలుడు పదార్థాలు నిల్వ వున్నాయంటూ కేసు పెట్టాడు. స్వాధీనం చేసుకున్న టపాసుల్లో ఒక భాగం కోర్టుకు పెట్టి మూడు భాగాలు ఎస్‌ఐ పట్టుకెళ్లి దీపావళి పండుగ జరుపుకున్నాడు.

## ఎర్ర చందనం స్మగ్లర్లకు సహకారం

రాత్రి సమయంలో ఎర్రచందనం స్మగ్లింగ్ చేస్తున్నారని ముందుగా సమాచారం అందితే నైట్ బీట్‌లో వున్న పోలీసులను ఇంటికి పంపి ఎస్‌ఐ కాపలా వుంటాడు. ఎస్‌ఐ కాపలా వుండేది ఎర్రచందనం పట్టుకునేందుకు అనుకుంటే పొరపాటు. స్మగ్లర్ల దగ్గర లంచం తీసుకొని ఎటువంటి ఇబ్బంది లేకుండా సరిహద్దులు దాటి వెళ్లేలా సహకరిస్తాడు. దీంతోపాటు ఇసుక అక్రమరవాణా, బ్రాందిషాపులు, కంకర క్వారీ, కోళ్ల పందాలు, ఓవర్‌లోడ్ లారీలు, పేకాట, వాహనాల తనిఖీ, మొండిబాకీల వసూళ్లు, అక్రమ కేసుల బనాయింపు నుంచి నెలకు దాదాపు లక్ష వరకు జేబులో వేసుకుంటున్నట్లు స్టేషన్ సిబ్బంది గుసగుసలాడుకుంటున్నారు.

ఇవి చాలదన్నట్లు పోలీసు అమరవీరుల సంస్మరణ దినం, స్టేషన్ సిబ్బంది బదలీ, పదవీ విరమణపై అధికారుల అతిథిమర్యాదలకోసమంటూ ఏదో ఒక సాకు చూసి దండకాలు చేస్తుంటాడు. ఈ దండకాల్లో ఆరితేరిన కలువాయి స్థానికుడైన రైటర్ బుజ్జయ్యను ఊరిమీదకు పంపుతుంటాడు. రక్తాన్ని పీల్చే జలగలా ఎస్‌ఐ ప్రజల నుంచి మామూళ్లు, డిమాండ్ చూస్తూ ఇబ్బంది పెడుతున్న విషయంపై స్పెషల్ బ్రాంచి, ఇంటిలిజెన్స్ పోలీసుల దృష్టికి రాక పోవడం విశేషం.

ఎన్ని సార్లు ఈ సర్వే!

# బడిబయట పిల్లలపై అంగన్‌వాడీల సర్వే!

**“ బడిబయట ఉన్న పిల్లలు, అంగవైకల్యంతో బాధపడే పిల్లల గూర్చి గతంలో రాజీవ్ విద్యామిషన్ ఉపాధ్యాయులతో ఒక సర్వే జరిపించింది. ఇది సక్రమంగా లేదని ఈ వ్యవహారంపై ఏమాత్రం అవగాహనలేని అంగన్‌వాడీ వర్కర్ల చేత మరో సర్వే మొదలు పెట్టడం విమర్శలకు దారి తీస్తుంది. ”**

రాజీవ్ విద్యామిషన్ ఆధ్వర్యంలో బడిబయట పిల్లలు, అంగవైకల్యంతో బాధపడే పిల్లల గురించి మళ్లీ సర్వే జరగనుంది. ఇప్పటికే ఒక దఫా ఉపాధ్యాయులు సర్వే జరిపి నివేదికలు సమర్పించి వున్నారు. 6-14 సంవత్సరాల మధ్య బడిబయట వున్న పిల్లలు, అంగవైకల్యం సోకిన వారి వివరాల్లో వ్యత్యాసం వుందన్న సాకుతో మళ్లీ సర్వే చేయించాలని అధికారులు నిర్ణయించారు. తొలివిడత సంబంధిత ఉపాధ్యాయుల ద్వారా సర్వే చేయించిన అధికారులు రెండవ విడతలో అంగన్‌వాడి వర్కర్ల చేత సర్వే చేయించాలని ఆదేశాలు జారీ చేశారు. డిసెంబర్ 3 నుంచి ఈ సర్వే కార్యక్రమం జిల్లాలో ప్రారంభం కానుంది. సర్వే ఎలా చేయాలన్న దానిపై స్త్రీ శిశు సంక్షేమశాఖ ఆధ్వర్యంలో పనిచేస్తున్న ఐసిడిఎస్ సూపర్‌వైజర్లకు శిక్షణ కూడా ఇవ్వడం జరిగింది. శిక్షణ పొందిన సూపర్‌వైజర్లు అంగన్‌వాడి వర్కర్లకు శిక్షణ ఇస్తారు.

## పొరపాట్లు జరిగే అవకాశం

క్షేత్రస్థాయిలో 6-14 సంవత్సరాల వయసు కలిగి బడిబయట వున్న పిల్లలు, అంగవైకల్యం ఉన్న పిల్లలను అంగన్‌వాడి వర్కర్లు గుర్తించి సర్వే నమూనా ఫారంలో నమోదు చేయాల్సి వుంటుంది. ఉన్నత చదువులు చదివి, ఉద్యోగం చేస్తున్న ఉపాధ్యాయులు జరిపిన సర్వేలో పూర్తి వివరాలు నమోదు కాబడలేదన్నది అధికారులు అభిప్రాయం. 10వ తరగతి కూడా ఉత్తీర్ణత కాని అంగన్‌వాడి వర్కర్ల చేత సర్వే జరిపిస్తే వారు నమోదు చేసిన వివరాలు ఎలా వుంటాయో అధికారులకు తెలియంది కాదు. గతంలో వీరి చేత రేషన్‌కార్డుల సర్వే, ఓటరు నమోదు, ఆర్థిక, సామాజిక, కులగణన సర్వే కార్యక్రమాలు చేశారు. రేషన్ కార్డుల సర్వేలో అనర్హులకు తెల్లరేషన్ కార్డులు జారీ కాబడ్డాయి. ఆర్థిక సామాజిక, కులగణన సర్వేలో కూడా కుటుంబ వివరాలు నమోదు చేయడంలో అవకతవకలు చోటుచేసుకున్నాయి. వీటిపై మళ్లీ వీఆర్వో, పంచాయితీ కార్యదర్శులు రీసర్వే చేయాల్సి వచ్చింది.

గతంలో జరిగిన పొరపాట్ల నుంచి గుణపాఠాలు నేర్చుకోకుండా ఎటువంటి అవగాహనలేని అంగన్‌వాడి వర్కర్ల చేత సర్వే జరిపిస్తే ఫలితాలు ఎలా వుంటాయో అర్థం చేసుకోవచ్చు. సర్వే చేసినందుకు లక్షలాది రూపాయలు రాజీవ్ విద్యామిషన్ చెల్లించాల్సి వుంటుంది. గ్రామీణ ప్రాంతాల్లో పాఠశాలల్లో పనిచేసే ఉపాధ్యాయులు సమర్పించిన సర్వే వివరాలు పరిశీలిస్తే పొరపాట్లను సరిదిద్దవచ్చు. అలా కాకుండా మళ్లీ సర్వే చేయించాలన్న ఆలోచన అధికారులకు ఎందుకు కలిగిందోనన్న సందేహం కొందరు ఉపాధ్యాయులు వ్యక్తం చేస్తున్నారు. ప్రతి సంవత్సరం విద్యాశాఖ, రాజీవ్ విద్యామిషన్ సంయుక్తంగా పాఠశాలలకు వెళ్లకుండా బడిబయట వున్న పిల్లలపై, అంగవైకల్యం కలిగిన వారిని గుర్తించేందుకు సర్వేలు జరుపుతూనే వున్నారు.

వేల సంఖ్యలో బడిబయట వున్న వారిని పాఠశాలకు తీసుకొచ్చేందుకు విద్యాశాఖ సరైన కృషి చేయడం లేదన్న విమర్శలు వున్నాయి. సర్వే జరిపి నివేదికలు రూపొందించి ప్రభుత్వానికి సమర్పించి చేతులు దులుపుకుంటున్నారు. ఐదు సంవత్సరాల వయసు కలిగిన ప్రతి పిల్లవాడు గ్రామంలో వున్న పాఠశాలలో చేరే విధంగా ఉపాధ్యాయులు ప్రచారం చేయాలి. ప్రతి ఇంటికి వెళ్లి తల్లిదండ్రులను సంప్రదించి బడికి పంపే విధంగా ఒప్పించాలి. కొందరు ఉపాధ్యాయులు ఈ ప్రయత్నం చేస్తుండగా, మరికొందరు పిల్లలను బడికి పంపే బాధ్యత తల్లిదండ్రులదేనని తప్పించుకొంటున్నారు. కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలు ఏశాఖకు కేటాయించని విధంగా విద్యా, వైద్య ఆరోగ్యశాఖలకు ప్రతి సంవత్సరం కోట్ల రూపాయలు విడుదల చేస్తున్నారు. క్షేత్రస్థాయిలో ఫలితాలు మాత్రం అధ్వాన్నంగా వున్నాయి.

రాజీవ్ విద్యామిషన్ ఆధ్వర్యంలో నిర్వహించే ప్రతి కార్యక్రమం, అమలు చేసే పథకాల్లో అవినీతి, అక్రమాలు చోటు చేసుకుంటున్నాయన్న ఆరోపణలు వున్నాయి. కేవలం నిధులు ఖర్చు చేసి కమీషన్లు దండుకునేందుకు ప్రాధాన్యత ఇస్తున్నారే తప్ప ప్రయోజనాల గురించి పట్టించుకోవడం లేదన్న విమర్శలు వెల్లువెత్తుతున్నాయి.



# కృష్ణం వందే జగద్గురుమ్ ఫట్

✍ అల్లూరు రహీం

ప్రత్యామ్నాయ కథలపైనే తన దృష్టంతా అంటాడు హీరో రానా. తన సినిమా చూసేందుకు థియేటర్‌కు వచ్చే ప్రేక్షకునికి కొత్త తరహా వినోదం పంచి పెట్టాలన్నది ఆయన ఆశయం. లీడర్ తరహా కొత్త కథతో తెలుగు తెరపైకి వచ్చిన రానా ఇప్పటి వరకు హిందీతో కలిపి ఆరు సినిమాల్లో నటించాడు. తాజాగా ఫస్ట్‌ఫ్రేమ్ ఎంటర్‌టైన్‌మెంట్ పతాకంపై క్రిష్ దర్శకత్వంలో 'కృష్ణం వందే జగద్గురుమ్' చిత్రంలో నటించాడాయన. పేరు గొప్ప ఊరు దిబ్బలా ఉంది ఈ చిత్రం. జగద్గురుతత్వాన్ని సామాన్య జనం మెచ్చేలా చెప్పడం మామూలు విషయం కాదు. కృష్ణం వందే జగద్గురుమ్ చిత్రంలో ఒకే ఒక లైన్ కథ విస్తరణకు దర్శకుడు క్రిష్ నానాపాట్లు పడ్డాడు. కర్నాటక – ఆంధ్రా సరిహద్దుల్లో గతంలో నిరాటంకంగా జరిగిన మైనింగ్ మాఫియా గుర్చి ఈ సినిమాలోకి తీసుకొచ్చాడు. వైఎస్ జగన్మోహన్‌రెడ్డి సంపాదించినట్లు చెబుతున్న లక్ష కోట్ల రూపాయలపై ఈ చిత్రంలో చర్చ పెట్టాడు. జనాలతో నాటకాలు ఆడుతున్నారని వైఎస్ కుటుంబాన్ని దెప్పిపొడిచాడు. పౌరాణిక నాటక సమాజం సురభిని ఈ చిత్రకథ నడపడానికి వాడుకొన్న తీరు పండలేదు. సురభి నాటక కళాకారులను తక్కువచేసి చూపించిన తీరు బాగోలేదు. చిత్రంలో అర్థంకాని ట్విస్ట్‌లు, తికమకల మధ్య రెండు పాటలకు నయనతార చేసిన దేహ ప్రదర్శన చాలదని, సమీరారెడ్డితోపాటు మరో బాలీవుడ్ భామతో కలిపి రెండు ఐటమ్ పాటలు పెట్టినా అవి ప్రేక్షకులు మెచ్చలేదు. విక్టరీ వెంకటేష్ అనవసరంగా ఈ చిత్రంలో ఒక పాటలో కనపడి పరువు తీసుకొన్నాడు. మామూలుగా మాస్ పాటలకు మంచి సంగీతం సమకూర్చే మణిశర్మ ఈ చిత్రంలో ఏ ఒక్క పాటను జనరంజకంగా తీర్చిదిద్దలేకపోయాడు. సాయిమాధవ్ వ్రాసిన మాటల్లో మీడియా అంటే పెద్ద సర్కస్ కంపెనీ. పురిటినొప్పులు చూసిన వాడు మనిషి... పడక సుఖం చూసేవాడు నీచుడు. చస్తే ఏడ్చేవాడుంటే వాడు చచ్చినా బతికినట్లే; దేవుడంటే సాయం ఆలోచింప జేస్తాయి. హీరో రానా ఈ సినిమాలో పలు పౌరాణిక పాత్రల్లో కనపడతాడు. వాస్తవంగా చెప్పాలంటే ఈ పాత్రల్లో ఆయన అందగించలేదు. ఆయన కండల ప్రదర్శన కూడా కృష్ణం వందే జగద్గురుమ్‌లోని బిటెక్ బాబు పాత్రకు అవసరం లేదు.

చిత్ర సమీక్ష

చిత్ర కథలోనికి వెళ్తే సురభి నాటక సమాజం నిర్వాహకుడు సుబ్రహ్మణ్యం(కోట శ్రీనివాసరావు) మనుమడు బిటెక్‌బాబు(రానా). జనాన్ని కళ నిద్దురలేపొచ్చు కానీ కళాకారులు దాన్ని నమ్ముకుని నాశనమై పోతున్నారని బిటెక్ బాబు నిశ్చితాభిప్రాయం. అందువల్లే అమెరికా వెళ్లను అంతా సిద్ధం చేసుకొంటాడు. ఇంతలో తాత సుబ్రహ్మణ్యం చనిపోవడంతో ఆయన అస్థికలు కలపను కర్నాటక రాష్ట్రం బళ్లారి జిల్లాలోని నల్లచెరువు ప్రాంతానికి బయలు దేరుతాడు. మైనింగ్ మాఫియా నేత రెడ్డప్ప(మిలింద్ గునాజి) నల్లచెరువు ఉనికే లేకుండా తోడేస్తాడు. ఇక్కడుండే అడవి తల్లి బిడ్డలు అడవిని ఖాళీచేసి వెళ్లడంలేదని అడవికి నిప్పు పెట్టిస్తాడు. బళ్లారి నాటకోత్సవ సమయంలో నాటక బృందసభ్యుడు రఘుబాబు నాలుకను రెడ్డప్ప మనిషి సైదా కోసేస్తాడు. అతన్ని వెతుకుతూ బయలుదేరిన బాబుకు జర్నలిస్ట్ దేవిక(నయనతార) కనపడుతుంది. వీరిద్దరూ ఆకర్షితులవుతారు. నల్లచెరువు, రేణుకమ్మ ఘాట్‌లలో జరిగే మైనింగ్ మాఫియా గుర్చి దేవిక, బిటెక్ బాబుకు చెబుతుంది. అడవి తల్లి బిడ్డ జోగమ్మ(అన్నపూర్ణ) ద్వారా బాబుకు తన కుటుంబ చరిత్ర తెలుస్తుంది. మైనింగ్ మాఫియాతో అడవి బిడ్డలను, తన కుటుంబాన్ని సర్వనాశనం చేసి రెడ్డప్పగా పేరు మార్చుకొని చలామణి అవుతున్న తన మేనమామ చక్రవర్తిని బాబు గుర్తిస్తాడు. బళ్లారి దసరా ఉత్సవాలలో ప్రదర్శించమని సురభి సుబ్రహ్మణ్యం వ్రాసిచ్చిన కృష్ణం వందే జగద్గురుమ్ నాటకం చివరి అంకంలో ఉగ్ర నరసింహస్వామి అవతారంలో చక్రవర్తిని నాటకీయంగా చంపడంతో చిత్రం ముగుస్తుంది. మాస్, క్లాస్ మెప్పించలేని చిత్రంగా కృష్ణం వందే జగద్గురుమ్‌ను అభివర్ణించవచ్చు.

## బికినీలో నయనతార!



హీరోయిన్ నయనతార జీవితాన్ని విశ్లేషిస్తే శ్రీరామరాజ్యం ముందు తర్వాత అని వర్గీకరించాల్సిందే. ఎందుకంటే శ్రీరామరాజ్యంలో సీత పాత్రకు ఆమెను ఎంపిక చేసినప్పుడు అందరూ సందేహాలు లేవనెత్తారు. నయనతార ఆ పాత్రకు న్యాయం చేయలేదని. కానీ బాపు ఆమెను సీతమ్మగా మలచి చూపించిన విధానం ప్రశంసలు పొందింది. నయనతారను ఉత్తమ నటిగా నిలిపింది. అయితే ఇప్పుడు మళ్లీ తన ఇమేజ్‌కు కమర్షియల్ హంగులు అద్దే దిశగా ఆలోచనలు చేస్తుంది. ఎందుకంటే సీత ముద్ర ఉండిపోతే విభిన్నమైన పాత్రలు రావని ఆమె సందేహమని సినీ వర్గాలు అంటున్నాయి. కృష్ణం వందే జగద్గురుమ్‌లో ఘాటుగా కనిపించిన నయనతార నాగార్జున సరసన నటించే చిత్రంలో బికినీలో కనిపించనుందట. ఈ చిత్రానికి దశరథ్ దర్శకుడు.



## విశ్రాంతిలో స్నేహఉల్లాల్!

సినిమా షూటింగుల్లో ఒకట్రెండు రోజులు విరామం దొరికితే హీరోయిన్లు ఇంటిపట్టున కూర్చోవడం లేదు. వాణిజ్య ప్రకటనలకో, ప్రారంభోత్సవాలకో హాజరై ఆకర్షణీయమైన పారితోషికాన్ని అందుకొంటున్నారు. ముఖ్యంగా ప్రారంభోత్సవాలు, ప్రచార కార్యక్రమాల్లో పాల్గొన్నప్పుడు జరిగే తొక్కిసలాట, సందడి హీరోయిన్లకు ఇబ్బందికరంగా మారుతోంది. ఎంత సెక్యూరిటీ నియమించినా కష్టాలు తప్పడం లేదు. స్నేహఉల్లాల్ ఈ మధ్య గుంటూరులో ఓ ప్రారంభోత్సవానికి వెళ్లింది. అక్కడ జరిగిన గందరగోళంలో ఆమె కాలు మడత పడిపోయింది. దాంతో కాలికి చిన్న గాయమై... కొద్ది రోజులు విశ్రాంతి తీసుకోవాల్సి వచ్చింది. దీంతో ఆమె నటించాల్సిన 'యాక్షన్' అనే త్రీడీ చిత్రం వాయిదా పడింది.

## హీరోగా దేవిశ్రీ?



దేవిశ్రీప్రసాద్ సంగీత దర్శకుడే కాదు పాటల విడుదల వేడుకల్లో మంచి డ్యాన్సర్ అని నిరూపించుకొన్నాడు. పాటలు సైతం వ్రాసేస్తున్నాడాయన. ఎప్పటి నుంచో దేవిశ్రీకి సంబంధించిన ఓ విషయం షికారు చేస్తూనే ఉంది. అదేంటంటే ఆయన హీరోగా నటించబోతున్నారు అని. ఈ విషయాన్ని ప్రస్తావించినప్పుడల్లా దాటవేస్తూ వస్తున్నారు. ప్రస్తుతం మిర్చి, సారొచ్చారు, ఎవడు, ఇద్దరమ్మాయిలు చిత్రాలకు సంగీతం సమకూరుస్తున్న దేవిశ్రీప్రసాద్ ఇవి పూర్తయ్యాక కెమెరా ముందుకు వస్తారట. దీని కోసం కొన్ని కథలు కూడా వింటున్నాడట. ఆయన సరసన శ్రియ హీరోయిన్‌గా నటిస్తుందని చెన్నైలో పుకార్లు షికార్లు చేస్తున్నాయి. దేవిశ్రీ ప్రసాద్ మాత్రం ఈ విషయాన్నింకా ధృవీకరించలేదు.



## గబ్బర్‌సింగ్ ఇన్ హైదరాబాద్!

ఈ యేడాది వేసవిలో బాక్సాఫీసు దగ్గర సందడి చేసిన చిత్రం గబ్బర్‌సింగ్. కొన్నేళ్లుగా విజయం దక్కని హీరో పవన్ కళ్యాణ్‌ను ఫామ్‌లోకి తీసుకొచ్చింది. అందులోని వినోదం, యాక్షన్ అంశాలు భారీ వసూళ్లను తీసుకొచ్చాయి. ఈ సినిమా దబాంగ్ అనే హిందీ చిత్రానికి రీమేక్. దబాంగ్ – 2 డిశంబర్‌లో విడుదలవుతుంది. ఈ నేపథ్యంలో గబ్బర్‌సింగ్‌కు రెండో భాగం తెలుగులో తీసే అవకాశం ఉందంటున్నారు. ఇప్పటికే నిర్మాత దబాంగ్ – 2 బృందంతో చర్చలు సాగించారని సమాచారం. తెలుగులో సీక్వెల్‌కు గబ్బర్‌సింగ్ ఇన్ హైదరాబాద్ అనే పేరు పెట్టాలని నిర్ణయించి ఈ మేరకు టైటిల్‌ను కూడా రిజిష్టర్ చేయించారు.

## కాస్త విశ్రాంతి తీసుకోనివ్వండి!



నాలుగైదు భాషల్లో ఎక్కడో ఒక చోట సందడి చేస్తూ కనిపించే జెనీలియా ఈ మధ్య నల్లపూసై పోయింది. రితేష్‌దేశ్‌ముఖ్‌ను వివాహమాడాక ఈ అమ్మడు పూర్తిగా తెరకు దూరమయ్యింది. ఇటీవల హైదరాబాద్ వచ్చిన ఆమెను ఎన్నాళ్లీ విరామమంటే; సమాధానంగా ఇలాంటి సమయం కోసం ఎప్పట్నుంచో ఎదురు చూస్తూ వచ్చాను. ఇప్పుడు అవకాశం లభించింది. ఇంకొన్ని రోజులు విశ్రాంతి తీసుకోనివ్వండి. చిన్న వయస్సులోనే కెరీర్ ప్రారంభించాను. పదేళ్లుగా విరామం లేకుండా ఐదు భాషల్లో నటిస్తూ వచ్చాను. పెళ్లి తర్వాత కొంచెం విరామం దొరికిందంతే. ఈ విశ్రాంతికి నేను పూర్తిగా అర్హురాల్ని అంది. మనం కాదంటామా??



తల్లితండ్రులతో ఇంజనీరింగ్ టాప్ ర్యాంకర్ మాదిరెడ్డి రేణుషా.

# మాదిరెడ్డి రేణుషాకు బంగారు పతకం!

సామాన్యుని ఇంట చదువుల తల్లి పుట్టింది. ఇంజనీరింగ్ విద్యల్లో వరుసగా నాలుగేళ్ల యూనివర్శిటీ టాపర్‌గా నిలచి బంగారు పతకం సాధించింది. ఈ చదువు తల్లినే మాదిరెడ్డి రేణుషా. నెల్లూరు మిలటరీ కాలనీకి చెందిన మాదిరెడ్డి రవీంద్ర ఆర్థికంగా పెద్ద స్థితిమంతుడు కాదు. ఇంటర్‌లో అమ్మాయికి వచ్చిన మార్కుల ఆధారంగా వెలమ కులస్తులకు వెలమ సంఘం ఇచ్చే స్కాలర్‌షిప్పుకు రేణుషా దరఖాస్తు పంపింది. అది మంజూరు కావడంతో వెంకటాచల సత్రంలోని క్యాబా ఇంజనీరింగ్ కాలేజిలో ఇన్ఫర్మేషన్

## వెలమ సంఘం స్కాలర్‌షిప్పే చేయూత

టెక్నాలజీ విభాగంలో చేరింది. కష్టపడి చదవడం ఒకటే తెలిసిన ఆమె అనంతపురంలోని జెఎన్‌టియూ పరిధిలోని 183 కళాశాలలున్నా అందులో వేలాది మంది ఇంజనీరింగ్ చదువుతున్నా నాలుగేళ్ల యూనివర్శిటీ టాపర్‌గా నిలచింది. దీంతో యూనివర్శిటీ ఈమెకు బంగారు పతాకం ప్రకటించింది. గవర్నర్ చేతులమీదుగా రేణుషాకు త్వరలో ఈ పతకం అందిస్తారు. క్యాబా ఇంజనీరింగ్ కాలేజి యాజమాన్యం కూడా ఈ యువతికి ప్రోత్సాహకంగా 40వేల రూపాయల విలువ చేసే ల్యాప్‌టాప్ బహుమతిగా ఇచ్చి ప్రోత్సహించారు. తల్లి రజని, తండ్రి రవీంద్రకుమార్, కాలేజి అధ్యాపకులే తనకు స్ఫూర్తి దాతలంటుంది రేణుషా. కష్టేఫలి అనేదానికి రేణుషా నిలువెత్తు నిదర్శనమనవచ్చు.

# కొత్త ఓటర్లు 50వేల మంది!

జిల్లావ్యాప్తంగా కొత్తగా 50వేల మంది ఓటరు నమోదు దరఖాస్తు చేసుకున్నారు. నవంబరు 20వ తేదీతో ఓటరు నమోదు గడువు ముగిసిన సంగతి తెలిసిందే. అసెంబ్లీ నియోజక వర్గాల పరిధిలో నియమించిన పోలింగ్ కేంద్రం స్థాయి అధికారులు ఓటరు నమోదు దరఖాస్తుల్ని స్వీకరించి మండల తహశీల్దార్ కార్యాలయాల్లో అందజేయడం జరిగింది. ఎన్నికల సంఘం సూచించిన విధంగా ప్రతి ఇంటికి వెళ్లి నమోదు కాబడిన ఓటరు స్థానికంగా నివాసం ఉన్నాడా లేదా అన్న సమాచారాన్ని సేకరించలేదు. మండల స్థాయి అధికారులు ఓటరు నమోదుపై గ్రామాల్లో పర్యటించి అవగాహన కల్పించాలన్న ఆదేశాలున్నప్పటికీ ఆ దిశగా అధికారులు ఎక్కడా సదస్సులు నిర్వహించలేదు. 2013 జనవరి నాటికి 18 సంవత్సరాలు నిండిన వారికి ఓటు హక్కు కల్పించాలన్నది ఎన్నికల సంఘం ప్రధాన ఉద్దేశం. అయితే ఇక్కడ అధికారుల నిర్లక్ష్యం కారణంగా ఓటరు నమోదు దరఖాస్తులను గ్రామాలకు పంపలేదు. ఒక దరఖాస్తును అందజేసి జెరాక్స్ తీసుకోవాలని బిఎల్‌ఓలకు సూచించి పంపారు. గ్రామీణ ప్రాంతాల్లో జెరాక్స్ కేంద్రాలు ఉండవన్న కనీస జ్ఞానం అధికారులకు లేకపోవడం విశేషం. మొత్తంమీద ఈ దఫా నిర్వహించిన ఓటరు నమోదుకు 50వేల దరఖాస్తులు వచ్చాయని అధికారులు చెబుతున్న తుది జాబితా ప్రకటించే సమయానికి దరఖాస్తుదారుల పేర్లు గల్లంతు కాకుండా చూడాల్సిన అవసరం ఉంది.

# నడివీధిలో సిబిసిఐడి!

**● దర్యాప్తు సంస్థపై విశ్వాసం పోగొట్టిన డిఎస్పీ!**



నెల్లూరులోని సిబిసిఐడి కార్యాలయం. (ఇన్‌సెట్లో డిఎస్పీ విజయకుమార్)

అధికారులు అవినీతి, అక్రమాలకు పాల్పడితే సామాన్యులకు న్యాయం జరగదనేందుకు మనీస్కీంలో సిఐడి అధికారుల పాత్ర ఉదాహరణ. పేద, మధ్యతరగతి వర్గాల ప్రజలు తక్కువ మొత్తంతో రెట్టింపు మొత్తాలు వస్తాయని, అధిక లాభాలు గడించవచ్చన్న దురాశతో మనీస్కీంలో సభ్యులుగా చేరి లక్షలాది రూపాయలు కట్టారు. ప్రారంభంలో సరిగానే నగదు పంచిన నిర్వాహకులు తర్వాత బోర్డు తిప్పేయడంతో జిల్లా ఎస్పీ జోక్యం చేసుకుని ఈ వ్యవహారంపై విచారణ జరిపించారు. దీని తీవ్రతను గమనించిన నెల్లూరీయుడైన డిజిపి దినేష్‌రెడ్డి ఈ వ్యవహారంపై విచారణ జరపమని సిఐడి విభాగాన్ని ఆదేశించారు. అధికారులు దర్యాప్తు చేపట్టడంతో న్యాయం జరుగుతుందని, అప్పు సొప్పు చేసి కట్టిన డబ్బులు తిరిగి వస్తాయని ఆశపడ్డారు బాధితులు. వీరి ఆశలను అడియాశలు చేసేలా సిఐడి అధికారులు వ్యవహరించడంతో మొత్తం దర్యాప్తే ప్రక్కదారి పట్టింది. సిఐడి డిఎస్పీగా వ్యవహరించిన విజయ్‌కుమార్‌పై మొదటి నుంచి పలు అవినీతి ఆరోపణలు ఉన్నాయి. ఆయనే ఈ దర్యాప్తును చేపట్టడంతో అందరూ అనుమానించినట్లుగా పలు అవకతవకలు జరిగాయనే ఆరోపణలు వెల్లువెత్తాయి. కీలక వ్యక్తులను అరెస్టు చేసి, వారి వద్ద నుంచి భారీగా నగదు, ఖరీదైన కార్లు స్వాధీనం చేసుకొన్నాడని, పెద్ద మొత్తంలో స్వాహా చేశాడని, పలువురు మనీస్కీం సూత్రధారులతో కుమ్మక్కై కేసు నీరుగార్చేందుకు ప్రయత్నిస్తున్నాడని ప్రజాసంఘాలు, పలువురు నేతలు డిజిపి దినేష్‌రెడ్డి, ఉప ముఖ్యమంత్రి రాజనరసింహకు ఫిర్యాదు చేశారు. వీటి తాకిడి అధికం కావడంతో దీనిపై కూపీలాగిన డిజిపికి సిఐడి డిఎస్పీ అవినీతి తెలిసి వచ్చిందట. దీంతో ఆయన సిఐడి అధికారులపై చర్యలు చేపట్టారు. డిఎస్పీ విజయకుమార్‌ను విఆర్‌లో పెట్టడంతోపాటు కేసు దర్యాప్తు బాధ్యతలను సిట్‌కు అప్పగించారు. హైదరాబాద్ నుంచి కొందరు అధికారులు నగరానికి వచ్చి రహస్య విచారణ జరిపి కీలక పత్రాలను స్వాధీనం చేసుకొని పోయారు. ఇంతవరకు బాగానే ఉన్నా బాధితుల్లో మాత్రం ఆందోళన వ్యక్తం అవుతుంది. ఇప్పటికే కేసు విచారణ ప్రారంభించి ఏడాదికిపైగా అవుతోంది. తాము కట్టిన డబ్బులు తిరిగి అందబోతున్నాయన్న తరుణంలో తిరిగి సిట్ విచారణ బాధ్యతలు తీసుకోవడంతో కేసు విచారణ మొదటికి రానుందని ఇక ఎప్పటికి న్యాయం జరుగుతుందని బాధితులు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు.

# నాగభైరవ అవార్డుతో సాహితీ పునర్జన్మ!



తనికెళ్ల భరణిని సన్మానిస్తున్న దృశ్యం.

డాక్టర్ నాగభైరవ కోటేశ్వరరావు స్మారక అవార్డును అందుకోవడంతో సాహితీ పునర్జన్మ లభించినట్లయ్యిందని ప్రముఖ సినీ నటుడు, రచయిత తనికెళ్ల భరణి సంతోషం వ్యక్తం చేశారు. విఖ్యాత సాహితీవేత్త, మాటల రచయిత డాక్టర్ నాగభైరవ కోటేశ్వరరావు స్మారకంగా అందజేస్తున్న అవార్డును ఈ ఏడాది తనికెళ్ల భరణిని ఎంపిక చేసి ఆయనకు దానిని ప్రదానం చేశారు. ఈ అవార్డు స్వీకరించిన సందర్భంగా భరణి తన మనసులోని భావాలను పంచుకొన్నారు. సినీ రంగంలో, నాటక రంగంలో ఎన్నో అవార్డులు లభించినా, ఎన్నో పురస్కారాలు, సన్మానాలు అందుకొన్నా వాటన్నిటికంటే నాగభైరవ పేరున వచ్చిన ఈ అవార్డు మధురానుభూతిని మిగిల్చిందన్నారు. డాక్టర్ నాగభైరవ రచయితలను ఎందరినో ప్రోత్సహించారన్నారు. ఆయన వ్రాసిన గుండ్లకమ్మ కథ చరిత్రలో చిరస్థాయిగా నిలచిపోతుందన్నారు. నాగభైరవ పేరిట అవార్డును నెలకొల్పిన అవార్డు కమిటీని ఆయన అభినందించారు. పద్మశ్రీ అవార్డు కంటే మిన్నగా ఈ అవార్డును భావిస్తానన్నారు. అవార్డు కమిటీ అధ్యక్షుడు వెన్నెలకంటి రాజేశ్వరప్రసాద్ మాట్లాడుతూ నాగభైరవతో తనకున్న సాన్నిహిత్యాన్ని నెమరు వేసుకొన్నారు. సింహపురి సీమతో ఆయనకు ఎనలేని అనుబంధం ఉందన్నారు. ప్రముఖ కథకుడు, ఓనమాలు సినిమాతో మాటల రచయితగా పరిచయం అయిన ఖదీర్‌బాబు మాట్లాడుతూ తనలాంటి ఎంతో మంది యువ రచయితలను నాగభైరవ వెన్నుతట్టి ప్రోత్సహించారన్నారు. ఆయన లాగే తనికెళ్ల భరణి కొత్తవారిని ఎంతగానో ప్రోత్సహిస్తారని ప్రశంసించారు. తనికెళ్ల భరణి అంటే తనకెంతో కోపమని, ఆయన వేసే పాత్రలు అలాంటి భావాన్ని కల్గిస్తాయని, కానీ నిజజీవితంలో ఆయన మంచి మనసున్న వ్యక్తి అని కావలి శాసన సభ్యుడు బీద మస్తాన్‌రావు వ్యాఖ్యానించారు. ప్రతిభావంతుడైన ఖదీర్‌బాబును తన తండ్రి బీద రమణయ్య పేరిట నెలకొల్పిన అవార్డుతో త్వరలో జరిగే కార్యక్రమంలో సత్కరించనున్నట్లు సభాముఖంగా ప్రకటించారు. సభానంతరం తనికెళ్ల భరణి దర్శకత్వం వహించి ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం, లక్ష్మి ప్రధాన పాత్రలను పోషించిన మిధునం సినిమాకు సంబంధించిన ఆడియోను ఆవిష్కరించారు. ఈ అవార్డు ప్రదానోత్సవ కార్యక్రమంలో మురళీ కృష్ణ హజరత్‌బాబు, చిన్ని నారాయణరావు, అనంత్, శివప్రభాత్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

# స్కాలర్‌షిప్పులు ఎప్పటికిస్తారు?

**సాంఘిక సంక్షేమ శాఖలో సోంబేరులు**

సాంఘిక సంక్షేమ శాఖ అధికారుల నిర్లక్ష్యం కారణంగా విద్యార్థులకు స్కాలర్‌షిప్పు అందక ఆ కార్యాలయం చుట్టూ ప్రదక్షిణలు చేయాల్సిన పరిస్థితి ఏర్పడింది. స్కాలర్‌షిప్పుకు దరఖాస్తు చేసుకుని రెండు సంవత్సరాలు కావస్తున్నా నేటికీ మంజూరు కావడం లేదు. ఆన్‌లైన్ విధానం పుణ్యమా అంటూ కార్యాలయ సిబ్బంది తమకు సంబంధం లేదన్న విధంగా వ్యవహరిస్తూ విద్యార్థులను తిప్పలు పెడుతున్నారు. 2010 – 11 సంవత్సరంలో ఇంటర్మీడియట్‌లో ప్రవేశం పొంది ప్రస్తుతం డిగ్రీ మొదటి సంవత్సరం చదువుతున్న విద్యార్థులు స్కాలర్‌షిప్పు కోసం ఎంతో ఎదురు చూస్తున్నారు. ఆన్‌లైన్ దరఖాస్తులో స్కాలర్‌షిప్పు మంజూరైనట్టు చూపిస్తుంది. విద్యార్థి బ్యాంకు ఖాతాలో మాత్రం నగదు జమ కావడం లేదు. బ్యాంకు అధికారులను సంప్రదిస్తే నగదు విడుదల కాలేదని చెబుతున్నారు. సాంఘిక సంక్షేమ శాఖ కార్యాలయానికి వెళితే బ్యాంకు స్టేట్‌మెంటు, ఆన్‌లైన్ దరఖాస్తు నమూనా, అర్జీరాసి ఇవ్వండి పరిశీలిస్తామంటూ చెబుతున్నారు. ఇది గ్రామీణ ప్రాంతాల్లో ఉండే విద్యార్థులకు ఎంతవరకు సాధ్యపడుతుందో అధికారులే ఆలోచించాలి. కొందరు విద్యార్థులు ఇంటర్మీడియట్ వరకే చదివి అనంతరం మానేశారు. వీరు స్కాలర్‌షిప్పు గురించి పూర్తిగా మరచిపోయారు. కళాశాల యాజమాన్యాలు, అధికారులు పట్టించుకోక పోవడం పట్ల విద్యార్థుల తల్లితండ్రులు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. సాంఘిక సంక్షేమ శాఖలో సంవత్సరాల తరబడి ఈ విభాగంలో పాతుకుపోయిన వారిని తప్పించి ఇతరులకు అప్పగిస్తే విద్యార్థులు నష్టపోకుండా ఉండే అవకాశం ఉంది.

## రాజకీయ అనుభవరాహిత్యం!

మొదటి పేజీ కొరవ

పాటించాలని తెలుగుదేశం పార్టీ ఒక సవరణ ప్రతిపాదించింది. దానిపై ఓటింగ్ అడిగింది. స్పీకర్ యధాలాపంగా ఓటింగ్ అనుమతి ఇచ్చారు. దానితో ఒక్కసారిగా అటు కాంగ్రెస్, ఇటు వైఎస్‌జగన్ పార్టీ నేతలు బిత్తరపోయారు. ఎస్సీలలో వర్గీకరణ అనేది చాలా కాలంగా రాష్ట్ర రాజకీయాలలో నలుగుతున్న సమస్య. మంద కృష్ణమాదిగ చేస్తున్న యుద్ధం దీని కోసమే. ఎస్సీలలో ఒక వర్గం వారు మాత్రమే అన్ని సదుపాయాలను తమ స్వంతం చేసుకొంటున్నారని, ఎంతో కొంత అభివృద్ధి చెందినవారు మరింత అభివృద్ధి సాధిస్తున్నారే తప్ప, వెనుకబడిన వారు ముందుకు రాలేకపోతున్నారన్నది ఈ ఆందోళనకారుల వాదన. ఈ అసమానత నివారించాలంటే బిసి కులాలలో వలె ఎస్సీ కులాలలో కూడా ఎ బి సి డి అనే వర్గాలుగా విభజన జరిపి, ప్రాధాన్యత ప్రకారం వసతులు ఇవ్వాలన్నది కోరిక. ఎస్సీలలో వర్గీకరణకు మాల కులస్తులు విముఖులు. మాదిగ కులస్తులు అనుకూలురు. ఎస్సీలలో మాలలు ఇప్పటికే జగన్ పక్షంగా వున్నారన్న భావన వుంది. మాదిగలనైనా తమ వైపుకు లాక్కోవాలని తెలుగుదేశం ప్రయత్నం చేస్తున్నది. ఈ నేపథ్యంలోనే ఎస్సీ ఉప ప్రణాళికలో వర్గీకరణ పాటించాలనే సవరణ ప్రతిపాదించారు తెలుగుదేశం నేతలు. ఆ పార్టీలో చాలామంది సీనియర్లున్నారు. చంద్రబాబు లేకున్నా తమంత తాముగా వ్యూహాలను రచించగల నిపుణులున్నారు. దాని ఫలితమే ఈ సవరణ ప్రతిపాదన. దీనిలో వారికి రెండు లక్ష్యాలున్నాయి. మొదటిది మాదిగ కులస్తులను తమ వైపు ఆకట్టుకోవడం. మాలలు ఎటూ తమతో లేరు కాబట్టి ఈ సవరణ పట్టుదల వల్ల వారికి పోయేదేమీ లేదు. వస్తే మాదిగల ఆదరణ లాభం. రెండవది – జగన్ పార్టీని ఇరకాటంలో పెట్టడం.

ప్రభుత్వానికి వ్యతిరేకంగా అవిశ్వాస తీర్మానం పెట్టమని జగన్ పార్టీ ఆందోళన చేస్తున్నది. ఆ నేపథ్యంలో శాసనసభలో ఓటింగ్ జరిగితే ప్రభుత్వానికి అనుకూలంగా వారు ఓటు వేయలేరు. అట్లా ఓటు వేయకుంటే సవరణను, తద్వారా ఎస్సీ కులాల వర్గీకరణను అంగీకరించినట్లు అవుతుంది. అది మాలలలో అసంతృప్తికి దారి తీసే ప్రమాదం వుంది. తెలుగుదేశం నేతలు చాలా తెలివిగా పెట్టిన ఈ ఓటింగ్ ప్రక్రియలో పాపం జగన్ పార్టీ ఎమ్మెల్యేలు ఇరకాటంలో పడ్డారు. వలలో చేపల వలె చిక్కుకుపోయారు. చివరకు తెలుగుదేశంతో కలిసి ఓటు చేయక తప్పలేదు.

మరొకప్రక్క ఇదే సమావేశంలో వైఎస్ విజయమ్మ, రాజశేఖర్‌రెడ్డి పరిపాలన మొత్తంపై సిబిఐ విచారణ జరపమని ప్రభుత్వాన్ని కోరడం కూడా రాజకీయ అనుభవరాహిత్యానికి ఉదాహరణ. వ్యతిరేకుల చేతికి అస్త్రం ఇచ్చినట్లు అయ్యింది అది. ఏదిఏమైనా జగన్ పార్టీ శాసనసభ విషయంలో నేర్చుకోవాల్సింది, జాగ్రత్త పడవలసింది చాలా వుంది. తమ దగ్గర రాజనీతిజ్ఞులు లేరన్న నిజాన్ని గ్రహించి, తగిన ఏర్పాట్లు చేసుకోకుంటే భవిష్యత్తులో ఇంతకు మించిన సంకటాలు చాలానే ఎదురౌతాయి.



బోడిగాడి తోటలోని పిల్లలకు విద్యాబుద్ధులు నేర్పను ఎస్పీ బివి.రమణకుమార్ ఏర్పాటు చేసిన క్యాప్ సంస్థకు పది వేల రూపాయల విరాళాన్ని అందిస్తున్న పిసిసి కార్యదర్శి ఉడత వెంకట్రావు యాదవ్. చిత్రంలో సిఐ కోటారెడ్డి వున్నారు.

## జనవాణి

2వ పేజీ కొరవ

వార్త 'జమీన్‌రైతు'లో చదవి ఒళ్లు పులకించింది. స్వర్గీయ దొడ్ల సుబ్బారెడ్డి నెల్లూరులో పెద్దాసుపత్రి, డికెడబ్ల్యు కాలేజి స్థాపనకు చేసిన కృషి మరవలేం. దొడ్ల సుబ్బారెడ్డి ఆనాడు పెద్దాసుపత్రి ప్రాంగణంలో స్థలం సేకరించి పెట్టడం వల్లే ఈనాడు మెడికల్ కాలేజిపెడుతున్నాం. మెడికల్ కాలేజికి దొడ్ల సుబ్బారెడ్డి పేరు పెట్టడం సముచితం. దీనిలో మరొక అభిప్రాయానికి తావు లేదు.

ప్రొఫెసర్ నాగరాజరావు హైదరాబాద్

### మన్మోహన్‌సింగ్ అసమర్థుడు!

నవంబర్ 2వతేది 'జమీన్‌రైతు' సంచికలో 'ఆ బురద మడుగులో మునక మన్మోహనుడికి ఎంతో మధురం' శీర్షికతో ప్రచురితమైన వార్త చాలా బాగుంది. వార్తలోని విశ్లేషణలు అద్భుతం. భారత దేశానికి మన్మోహన్‌సింగ్ వంటి అసమర్థుడు ప్రధానిగా ఉండడం దేశ ప్రజలు చేసుకొన్న దౌర్భాగ్యం. దూడూ బసవన్నగా తలూపడం మినహా ఆయన తీసుకొన్న మంచి నిర్ణయాలను వేళ్లమీద లెక్కకట్టవచ్చు. ఎప్పటికప్పుడు మన్మోహన్ సింగ్ చేస్తున్న తప్పులను ఎత్తి చూపుతున్న 'జమీన్‌రైతు'కు అభివందనాలు.

వి.గోపినాథ్ నెల్లూరు

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

### మనీస్కీం రికార్డులు స్వాధీనం!

మనీ సర్క్యులేషన్ స్కీములపై ఇప్పటి వరకు సిబిసిఐడి డిఎస్పీ విజయ కుమార్ చేసిన దర్యాప్తు తాలుకు రికార్డులను హైదరాబాద్ నుంచి వచ్చిన ఆ శాఖ ఎఎస్పీ శ్రీనివాసరావు స్వాధీనం చేసుకొని తీసుకెళ్లారు. ఈ అధికారి రహస్యంగా నెల్లూరు వచ్చి ఈ పని కానిచ్చారు.

### శోధన్‌నగర్‌లో వృద్ధులపై దాడి వెనుక మహిళానేత?

డిశంబర్ 2వ తేది శోధన్‌నగర్‌లో డాక్టర్ దయాకర్ కుటుంబీకులకు చెందిన ఇంట్లో బాడుగకు ఉన్న విజేతమ్మ, సుధాకర్‌రెడ్డి దంపతులపై దయాకర్ అన్న రవీంద్రకుమార్ కుమారుడు సతీష్ కుమార్ 25 మంది వ్యక్తులతో కలసి చేసిన దాడి నగరంలో కొత్తరకం రౌడీయిజాన్ని చాటిచెప్పింది. డాక్టర్ దయాకర్, ప్రొఫెసర్ రవీంద్రకుమార్ ఇద్దరూ గౌరవనీయ కుటుంబ వ్యక్తులు. వీరి తల్లి శేషమ్మ తన తాలుకు శోధన్‌నగర్‌లో ఇంటిని బాడుగకు ఇవ్వగా, ఇచ్చిన వ్యక్తులను ఈ ప్రాంతంలోనే ఉన్న నగరంలో పేరుగాంచిన కాంగ్రెస్ మహిళానేత సహకారంతో ఖాళీ చేయించే ప్రయత్నంలో బాడుగకు ఉన్నముసలి దంపతులను దారుణంగా కొట్టారు. ఈ ఇంటిని మహిళా నేత ఎలానైనా చేజిక్కించుకొనే యత్నంలో ఈ దాడికి సహకారం అందించిందట. ముసలి దంపతులకు బిజెపి నేతలు అండగా నిలవడంతో ఎట్టకేలకు ఈ వ్యవహారమై నాల్గవ పట్టణ పోలీసులు కేసు నమోదు చేశారు.

### పూలేకు నివాళి!

ఆల్ ఆంధ్రా బ్యాంకు బిసి ఎంప్లాయిస్ వెల్ఫేర్ అసోసియేషన్ నెల్లూరు శాఖ నేతృత్వంలో మినీ బైపాసురోడ్డులోని మహాత్మ జ్యోతిరావు పూలే విగ్రహానికి ఆయన వర్ధంతిని పురస్కరించుకొని పూలమాలలు వేసి నివాళులర్పించారు. ఈ కార్యక్రమం ఆంధ్రా బ్యాంకు బిసి ఎంప్లాయిస్ అసోసియేషన్ నాయకులు కె.వెంకటేశ్వరరావు, ఎస్.భాస్కర్ రావు, బిసి బ్రహ్మయ్య పాల్గొన్నారు.

### ఎన్వీజిఎస్ విద్యార్థుల ర్యాలీ!

ప్రపంచ ఎయిడ్స్ దినోత్సవాన్ని పురస్కరించుకొని నెల్లూరు వేణుగోపాలస్వామి జూనియర్ మరియు డిగ్రీ కళాశాలల ఎన్ఎస్ఎస్ వాలంటీర్లు, విద్యార్థులు, అధ్యాపకులు, సిబ్బంది ర్యాలీ నిర్వహించారు. బాలాజీనగర్, వేపదొరువు, ఎసినగర్, ఎన్టీఆర్‌నగర్ ప్రాంతాల్లో నివసిస్తూ విద్యార్థులు చేసిన ర్యాలీకి మంచి స్పందన లభించింది. అనంతరం కాలేజిలో అవగాహన సదస్సు నిర్వహించారు. ఈ కార్యక్రమంలో జూనియర్, డిగ్రీ కళాశాలల ప్రిన్సిపాల్ డాక్టర్ ఆర్వీఎస్ ప్రసాద్, డాక్టర్ టి.వి. అశోక్‌కుమార్‌రెడ్డి, ప్రోగ్రాం ఆఫీసర్లు వై.కృష్ణార్జున రెడ్డి, డాక్టర్ వి.కొండారెడ్డి పాల్గొన్నారు.

### ఫోన్ చేస్తున్న దొంగలు

నెల్లూరు నగరంలో దొంగలు స్వైరవిహారం చేస్తున్నారు. పలు ప్రాంతాలలో జరిగిన దొంగతనాలు ఇందుకు నిదర్శనం. వీటిలోనూ దొంగలు వింత పోకడలను అవలంభిస్తున్నారు. అదేదో సినిమాలో నీ ఇంటికి వచ్చా... అనే డైలాగ్ చెప్పినట్లు దొంగతనానికి వచ్చిన వారు ఆ యజమానికే ఫోన్ చేయడం విశేషం. కరెంట్ ఆఫీస్ సెంటర్‌లో ఒక ఇంట్లో చొరబడిన దొంగలు అక్కడి ల్యాండ్‌లైన్ ఫోన్ నుంచే గోడమీద ఉన్న ఇంటి యజమాని సెల్ ఫోన్‌కు ఫోన్‌చేసి మీరెక్కడు వెళ్లారు, ఎప్పుడు వస్తారు అని అడిగారట. దీంతో నిశ్చేష్టుడైన ఆయన ప్రక్కింటి వారికి ఫోన్ చేయడంతో వారు వచ్చేలోపు దొంగలు పరారయ్యారట. పోలీస్ భయం లేకపోయేటప్పటికి దొంగలు ఎంత బరితెగించిపోయారో ఈ ఘటన రుజువు చేస్తోంది.

### 21 కిలోల గంజాయి పట్టివేత

నెల్లూరు నుంచి చెన్నైకు తరలిస్తుండిన 21 కిలోల గంజాయిని పోలీసులు పట్టుకొన్నారు. ముందస్తు సమాచారం అందుకొన్న చిల్లకూరు పోలీసులు బుధవారం టోల్‌ప్లాజా వద్ద వాహనాలను తనిఖీ చేయగా బస్సులో తరలిస్తుండిన గంజాయి దొరికింది. పోలీసులు గంజాయి స్వాధీనం చేసుకొని దీనిని తరలిస్తున్న వ్యక్తిని అరెస్టు చేశారు.

### సినిమా హాళ్లకు 2.75 లక్షల జరిమానా

సినిమా హాళ్లు పరమ ముదనష్టంగా ఉంటున్నాయి. అధికారులు ఎన్ని తనిఖీలు జరిపినా హాళ్ల యజమానుల్లో మార్పు రాకపోవడంతో అలాంటి వారికి జరిమానా విధించారు. జిల్లాలోని 51 సినిమా హాళ్లకు 2.75లక్షల రూపాయల జరిమానా వేశారు. జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతం ఈ విషయాన్ని వెల్లడించారు. ఒక్కో సినిమా హాలుకు ఐదు వేల నుంచి పది వేల వరకు జరిమానాగా విధించామని తెలిపారు. అలాగే నాణ్యతా ప్రమాణాలు పాటించని తొమ్మిది పెట్రోలు బంకులకు 1.20 లక్షలు జరిమానా, అవకతవకలకు పాల్పడిన 39 మంది రేషన్‌షాపు డీలర్లపై 6ఏ క్రింద కేసులు నమోదు చేశామన్నారు. ఇలాంటి జరిమానాలతోనైనా సినిమా హాళ్లు, పెట్రోలు బంకుల యజమానుల్లో మార్పు వస్తుందేమో చూడాలి.

### బాబు కోలుకోవాలని పూజలు

సుదీర్ఘ పాదయాత్ర చేస్తున్న టిడిపి అధినేత చంద్రబాబునాయుడు ఆరోగ్యం కుదుట పడాలని కోరుతూ బాలకృష్ణ అభిమానులు పూజలు నిర్వహించారు. స్థానిక రాయాజీవీధిలో గల ఆంజనేయ స్వామి ఆలయంలో పూజలు జరిపించి చంద్రబాబు నాయుడు కోలుకొని ఎలాంటి ఆటంకాలు లేకుండా పాదయాత్ర చేయాలని భగవంతుని ప్రార్థించారు. ఈ కార్యక్రమంలో బాలకృష్ణ అభిమాన సంఘం నేత వై.రవి తదితరులు పాల్గొన్నారు.

### కాంగ్రెస్ పార్టీ కాపీ కొడుతుంది

తెలుగుదేశం పార్టీ ప్రకటించిన పథకాలను కాంగ్రెస్ పార్టీ కాపీ కొడుతుందని టిడిపి రాజ్యసభ సభ్యుడు, రాష్ట్ర ఉపాధ్యక్షుడు సి.ఎం.రమేష్ విమర్శించారు. కాంగ్రెస్‌పార్టీ ఇటీవల ప్రకటించిన నగదు బదలీ పథకమే ఇందుకు ఉదాహరణ అని చెప్పారు. ఇటీవల నగరానికి వచ్చిన ఆయన జిల్లా పార్టీ కార్యాలయంలో విలేకరులతో మాట్లాడారు. సొంతంగా ఆలోచించి పథకాలు ప్రకటించలేక తమ పార్టీ నేత చంద్రబాబునాయుడు గత ఎన్నికల్లో ప్రకటించిన ఈ పథకాన్ని కాంగ్రెస్ ఉదర గొడుతున్నారని ఎద్దేవా చేశారు. వచ్చే ఎన్నికల్లో టిడిపి అధికారంలోకి రావడం ఖాయమన్నారు.

## పదరంగం -45

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | | | 4 | | 5 | 6 | | 7 |
| 8 | | | | 9 | | | 10 | | | |
| | | | 11 | | | | 12 | | 13 | |
| 14 | 15 | | | | | 16 | | 17 | | |
| | | | | | | 18 | 19 | | | |
| 20 | | | | | 21 | | | | | 22 |
| | 23 | 24 | | 25 | | | 26 | 27 | | |
| 28 | | | | | | 29 | | | | |
| 30 | | | | 31 | 32 | | | | 33 | |
| | | 34 | 35 | | 36 | | | 37 | | |
| 38 | | | | | | | | 39 | | |

**అడ్డం**

1. అవకాశం, వ్యవధి కల్గినది (4)
4. స్త్రీలు (4)
8. స్త్రీ (3)
9. రథం (2)
10. అటునుంచి 4వ భాగం (2)
11. అరికాళ్ల కాయలు (3)
12. బ్రతిమిలాడడం (4)
14. తెలుగు మిషన్ (2)
17. విశ్వదాభి యోగి (3)
18. వర్షం (2)
20. యతీశ్వరుడు క్లుప్తంగా (2)
21. యౌవనం (3)
23. తెలుగు డెకరేషన్ (4)
26. పట్నంబాబు (4)
29. దేవతలు అటునుంచే వస్తున్నారు (3)
30. కరువు (2)
31. చెదిరిన వదంతి అటునుంచి (3)
33. స్త్రీ (2)
34. క్షీరం (2)
36. ఆవుల గుంపులు (5)
38. ఆ రథం రంగడిదే (5)
39. చీట్లాట చీట్లు (3)

**నిలువు**

1. సేద్యం (4)
2. వనం – మరో రూపంగా, తోట (2)
3. బ్రహ్మ (2)
4. మొక్కలు, చెట్లు (3)
5. క్రింద నుంచి పిల్లన గ్రోవి, తడబడింది (3)
6. చల్లని పాలు కాదు క్రింద నుంచి (4)
7. క్రింద నుంచే నాల్గుమంది (4)
9. తెలుగు హనీ (2)
13. అందమైన స్త్రీ (3)
15. క్రింద నుంచి 12 రోజుల పాటు యటిపాక గ్రామంలో జరిగిన సోమయాగం (4)
16. ఊరుబయటి ప్రదేశం (3)
19. డిసెంబరు ముందు నెల (4)
22. దర్గాగిరి (4)
24. చుట్టూ నీళ్లుగల ప్రదేశం, క్రింద నుంచి పెన్ (2)
25. సంసారం క్రింద నుంచే మొదలైంది (3)
27. క్రింద నుంచి రుగ్మత (2)
28. ప్రత్యక్షమవడం (4)
29. ఆలోచనలు క్రింద నుంచి వస్తున్నాయి (4)
32. ఐదు తర్వాత? క్రింద నుంచి (2)
33. జిహ్వాక (3)
34. న్యాయం, పశుపోషణ (2)
35. వృశ్చికం క్రింద నుంచి (2)
37. క్రింద నుంచి ధనంలేనివాడు (2)

### సమాధానాలు

## పదరంగం -44

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 శు | భం | భూ | 2 యా | 3 త్ | | 4 శో | 5 భ | స్క | 6 ర | 7 ము |
| శ్రూ | | | 8 మి | భూ | | 9 ధ | వ | | 10 జ | ర |
| ష | | 11 ఖ | ని | | 12 ఆ | న | తి | | 13 ని | ప |
| | 14 లు | | | 15 ప | ది | | | | | |
| 16 చో | రు | డు | | | | | | | 17 గ | 18 మ |
| 19 ద్యం | పా | | 20 నా | రి | 21 కే | 22 ళం | | 23 నం | ద | నం |
| | 24 వ్యా | 25 ప | కం | | 26 త | మే | | స | | ద |
| 27 ము | | రో | | 28 ది | నం | | 29 కో | శా | 30 గా | రం |
| ర | | 31 ప | రా | గం | | 32 దీ | పం | | లి | |
| 33 పు | 34 రు | కా | | 35 త | 36 ని | వి | | 37 మా | మ | |
| 38 కా | సా | రం | | 39 ము | క్కం | టి | | 40 త | ర | ము |

# సంక్షిప్త సింహపురి

## మాగుంట సుబ్బరామిరెడ్డి జయంతి!



మాజీ ఎమ్పీ మాగుంట సుబ్బరామిరెడ్డి 65వ జయంతిని పురస్కరించుకొని ఆయన అభిమాని ప్రమీద శీనయ్య నెల్లూరు, పొదలకూరు రోడ్డులోని ప్రభుత్వ వికలాంగుల సంక్షేమ వసతి గృహంలోని విద్యార్థినులకు దుప్పట్లు, పండ్లు, స్వీట్లు పంచిపెట్టారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ ఒంగోలు, నెల్లూరు జిల్లాల ప్రజలకు మంచినీరు, విద్య, వైద్యం ఉచితంగా అందించిన మహావ్యక్తి సుబ్బరామిరెడ్డి అన్నారు. ఈ కార్యక్రమంలో కరేడు శ్రీనివాసులు, కె.మూర్తి, ఎవి.సుబ్బారావు, జి.శంకర్, డి.మాధవరెడ్డి, జి.పవన్‌నాయుడు, సివి.సునీల్‌కుమార్, డి.రమేష్ తదితరులు పాల్గొన్నారు.

## జాతీయస్థాయి పోటీలకు జషితారెడ్డి!



హైదరాబాద్‌లోని హకీంపేట స్పోర్ట్స్‌స్కూల్‌లో 24, 25, 26తేదీల్లో జరిగిన 58వ రాష్ట్రస్థాయి స్కూల్ గేమ్స్ అండర్ –19 జిమ్నాస్టిక్స్ పోటీలలో నెల్లూరు విశ్వసాయి జూనియర్ కళాశాలలో చదువుతున్న వాకాటి జషితారెడ్డి నాలుగు అంశాల్లో పాల్గొని నాలుగు వెండి పతకాలు సాధించింది. దీంతో డిసెంబర్ 9 నుంచి 14 తేది వరకు మహారాష్ట్రలోని పూనేలో జరిగే జాతీయస్థాయి పోటీలకు ఎంపికైన జషితారెడ్డిని కళాశాల సిబ్బంది, కోచ్, తల్లిదండ్రులు, క్రీడాభిమానులు అభినందించారు.

## చింతామణి గొప్ప నాటకం!



చింతామణి నాటకం హాస్యమా... అపహాస్యమా? అనే చర్చను కేతా అంకుల్ మెమోరియల్ ట్రస్ట్ ఇటీవల సుబేదారు పేటలోని నగరపాలక ప్రాథమిక పాఠశాలలో నిర్వహించింది. బి.వి.నరసింహం మాట్లాడుతూ నెల్లూరీయుడు కాళ్లకూరి నారాయణరావు వ్రాసిన చింతామణి గొప్ప నాటకమని, ఇది మంచినీతిని బోధిస్తుందన్నారు. గతంలో మహిళలు కూడా ఈ నాటకాన్ని విరివిగా చూసేవారన్నారు. ఇటీవల సుబ్బిశెట్టి – చిత్ర – చింతామణి – శ్రీహరి పాత్రలను కొందరు నటులు వక్రీకరించి ప్రదర్శించడం వల్ల గబ్బుపడుతున్నాదన్నారు. ఆర్వీ శేషయ్య నాయుడు మాట్లాడుతూ నాటకం మంచి సందేశాన్ని విజ్ఞానాన్ని చూపిస్తూ వినోదాన్ని ఇస్తే బాగుంటుందన్నారు. ఈ చర్చలో పాటూరు శ్రీనివాసులు, ఇరుగు సుబ్రహ్మణ్యం, రాధాకృష్ణ, వరదా శ్రీనివాసులు పాల్గొన్నారు. ఈ సందర్భంగా నాటకంలోని పద్యాలను కళాకారుడు నెల్లిపూడి రవికుమార్ మృదు మధురంగా పాడి వినిపించారు. పద్య నాటక కళాకారులు దుర్గం మధుసూదన్, బాలమ్మ, ప్రభావతమ్మ, పద్మనాభం, అమరా సుబ్బారావు, చక్రపాణి, అమానుల్లాలు పాడిన పద్యాలు ఆహుతులను అలరించాయి. ఈ కార్యక్రమాన్ని కేతా సుబ్బారావు ఏర్పాటు చేశారు.

## మానవుడు నిమిత్తమాత్రుడు!



నెల్లూరు ఆర్యవైశ్య సీనియర్ సిటిజన్స్ అసోసియేషన్ సర్వసభ్య సమావేశం ఆచారివీధిలోని హోటల్ శివంలో జరిగింది. వక్తగా విచ్చేసిన లయన్ పసుపత్తి బద్రీనాథ్ భగవద్గీతపై అద్భుత ఉపన్యాసం చేశారు. గీతలో శ్రీకృష్ణుడు అర్జునునికి ఉపదేశించిన ప్రతి విషయం ప్రతి మానవుడు ఆచరింపవలసిన విషయమని, సర్వం తానేనని తన నిర్దేశం ప్రకారమే ప్రతిది జరుగునని – ఎవరు కూడా ఏదీ కూడా తాను చేశాననుకోవడం పొరపాటని– చేసెడి వాడను నేనే.. చేయించెడివాడను నేనే... మానవుడు కేవలం నిమిత్త మాత్రుడన్నారని చెప్పారు. బివి.నరసింహం, సి.వి.కృష్ణయ్య, నూకల శేషయ్య తదితరులు ఈ సమావేశంలో మాట్లాడారు.

## చంద్రారెడ్డి డిగ్రీ కళాశాల విద్యార్థుల సాయం!



నెల్లూరులోని చంద్రారెడ్డి డిగ్రీ కాలేజిలోని రోటరాక్ట్ క్లబ్ విద్యార్థులు సేకరించిన 25వేల రూపాయల విరాళాన్ని రాజుపాళెంలోని విశ్వజనని బాలల అనాధ ఆశ్రయానికి కాలేజి కరస్పాండెంట్ ప్రతాప్‌కుమార్‌రెడ్డి నవంబర్ 30వతేది విరాళంగా అందించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ తమ కళాశాలలోని రోటరాక్ట్ క్లబ్ ఆధ్వర్యంలో ప్రతియేటా సేవాకార్యక్రమాలు చేపడుతూ విద్యార్థులను సమాజసేవలో భాగస్తులను చేస్తున్నామన్నారు. ఈ కార్యక్రమంలో రోటరీక్లబ్ ప్రెసిడెంట్ మధుసూధనరావు, రోటేరియన్ రాఘవేంద్రశెట్టి, రమణారెడ్డి విశ్వజనని బాలల ఆశ్రమం నిర్వాహకులు పాల్గొన్నారు.

# రైతు లోకం

# మినుము పంట - సస్యరక్షణ!

ప్రస్తుతం మన జిల్లాలో మినుము పంట పూత దశ నుంచి కాయలు ఏర్పడే దశ వరకు వున్నది. దీనిలో ప్రధానంగా పల్లాకు తెగులు, ఆకుమచ్చ తెగులు మరియు మరుకా మచ్చల పురుగు అక్కడక్కడా ఆశించి వున్నవి. వీటి నివారణకు క్రింద తెలిపిన సూచనలను పాటించాలి.

**పల్లాకు తెగులు:** ఈ తెగులు సోకిన మొక్కలను గమనించిన వెంటనే పీకి నాశనం చేయాలి. వ్యాప్తికి కారణమైన తెల్లదోమ నివారణకు ట్రైజోఫాస్ 2.5 మిల్లీలీటర్లు లీటరు నీటికి చొప్పున కలిపి పిచికారీ చేయాలి.

**కొరినోస్పోరా ఆకుమచ్చ తెగులు:** ఈ తెగులు సోకిన ఆకులపై చిన్న చిన్న గుండ్రని గోధుమ రంగు వలయాలుగా ఏర్పడి ఆకులు ఎండి రాలిపోతాయి. దీని నివారణకు మాంకోజెబ్ 2.5 గ్రాములు లీటరు నీటికి చొప్పున కలిపి పిచికారీ చేయాలి.

**మరుకా మచ్చల పురుగు:** ఈ పురుగు మొగ్గ, పూత, పిందె దశల్లో ఆశించి ఎక్కువ నష్టం కలుగజేస్తుంది. పూత దశలో పూలను గూడుగా చేసి లోపలి పదార్థాలను తింటుంది. కాయలు తయారయ్యేటప్పుడు కాయలను దగ్గరకు జేర్చి గుండుగా కట్టి, కాయలకు రంధ్రం చేసి లోపలి గింజలను తినటం వల్ల పంటకు ఎక్కువ నష్టం కలుగుతుంది. ఈ పురుగు నివారణకు థయోడికార్బ్ ఒక గ్రాము, డైక్లోరోవాస్ ఒక మిల్లీలీటరు లీటరు నీటికి చొప్పున కలిపి పిచికారీ చేసి నివారించవచ్చు. ఉధృతి ఎక్కువగా వున్నట్లయితే స్పైనోశాడ్ 0.3మిల్లీలీటర్లు లేక ఫ్లుబెండియమైడ్ 0.15మిల్లీలీటరు లీటరు నీటికి చొప్పున కలిపి పిచికారీ చేసి నివారించవచ్చు.

డాక్టర్ కె.పుల్లంరాజు
కోఆర్డినేటర్,
ఏరువాక (డాట్ సెంటర్), నెల్లూరు.



● అఖిలపక్షం

# అందరికీ ఇరకాటమే!

తెలంగాణపై అఖిలపక్ష సమావేశం ఏర్పాటు చేసింది కేంద్ర ప్రభుత్వం. ఎఫ్‌డిఐల విధానంపై లోక్‌సభలో ఓటింగ్ సందర్భంగా తెలంగాణ కాంగ్రెస్ ఎమ్పీలు బ్లాక్ మెయిలింగ్‌కు దిగడంతో విధిలేక ఈ సమావేశానికి తేదీ ప్రకటించాడు హోంమంత్రి సుశీల్‌కుమార్ షిండే.

## వివేకా ఆరోగ్యం ఇంకా ఆందోళనకరం

నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి ఆరోగ్యం ఇంకా కుదుటపడలేదు. హైదరాబాదులోని స్టార్ ఆస్పత్రిలో చికిత్స పొందుతున్నాడు. ఆయనకు మోకాలి కీలు నొప్పి అధికంగా వుందని, తీవ్రంగా బాధ పడుతున్నాడని ఆర్థికమంత్రి ఆనం రామనారాయణ రెడ్డి ప్రకటించాడు. అంతకు మించిన వివరాలు ఇవ్వలేదాయన. అయితే వివేకా ఆరోగ్యం పట్ల నెల్లూరు నగరంలో పలు రకాల వదంతులు, వార్తలు ప్రచారంలో వున్నాయి. తలకొక రీతిగా మాట్లాడుతున్నారు జనం. ఆస్పత్రి అధికారులు మాత్రం పెదవి విప్పడం లేదు.

మాకు అందిన సమాచారం ప్రకారం వివేకా ఆరోగ్యం ఇప్పటికీ ఆందోళనకరంగానే వున్నట్లు తెలుస్తున్నది. ఎంతోకాలంగా తనకున్న ఆరోగ్య సమస్యలకు తగిన చికిత్స తీసుకోకుండా వాయిదా వేస్తూ రావడంతో అవన్నీ ఒక్కసారిగా చుట్టుముట్టినట్లున్నాయి. తాజాగా కాలి నరంలో రక్త ప్రసరణకు ఆటంకం ఏర్పడిందని తెలుస్తున్నది. అది సంక్లిష్టమైన సమస్య. దానివల్ల వచ్చే బాధను తగ్గించుకోవడానికి సింగపూర్ నుంచి తెప్పించిన పొడవాటి రబ్బర్ సాక్స్‌తో కాలు మొత్తాన్ని బిగించి పెట్టి వున్నారట.

కనీసం ఇప్పటికైనా మానసిక భయాలను పక్కనపెట్టి, సరైన శస్త్ర చికిత్సలకు అంగీకరిస్తే ఈ సమస్యలన్నిటినీ పరిష్కరించవచ్చునని డాక్టర్లు అభిప్రాయపడుతున్నారు. కోతి పుండు బ్రహ్మాండం చేసుకొనే వితండ ధోరణి పక్కనపెట్టి, డాక్టర్ల మాట విని, సరైన చికిత్స చేయించుకొని, సంపూర్ణ ఆరోగ్యంతో నెల్లూరుకు తిరిగి రావాలని కోరుకొంటున్నాము.

తాము కోరినట్లు అఖిల పక్ష సమావేశం ఏర్పాటు చేయకుంటే లోక్‌సభలో ఓటింగ్‌ను బహిష్కరిస్తామని బెదరించారు తెలంగాణ ఎమ్పీలు. లోక్‌సభలో అసలే మైనార్టీలో వున్న ప్రభుత్వానికి ఈ ఎమ్పీలు తిరుగుబాటు చేస్తే అసలుకే మోసం వస్తుందన్న భయంతో వారి ఒత్తిడికి తలదించింది కేంద్రం.




అయితే ఇల్లలుకగానే పండుగ కాదన్నట్లు, అఖిలపక్ష సమావేశం పెట్టగానే తెలంగాణ వచ్చేస్తుందన్న భ్రమ ఎవరిలోను లేదు. తెలంగాణ పై ప్రధాన రాజకీయ పార్టీలైన కాంగ్రెస్, తెలుగుదేశం, వైఎస్ఆర్ కాంగ్రెస్‌లు మూడింటికీ స్పష్టమైన విధానం లేదు. కర్ర విరగకుండా పాము చావకుండా మాట్లాడడం వారికి అలవాటై పోయింది. తెలంగాణకు తాము వ్యతిరేకం కాదని మాట్లాడడం తప్ప తెలంగాణ ఇవ్వాలని కానీ, వద్దని కానీ ఈ మూడు పార్టీలూ చెప్పవు. చెప్పలేవు కూడా. కరవమంటే కప్పకు కోపం, విడవమంటే పాముకు కష్టం అన్నట్లు తెలంగాణ ఇవ్వమని సిఫార్సు చేస్తే ఆంధ్ర ప్రాంతంలో ప్రజలు తమను నిరాదరిస్తారని భయం. తెలంగాణ వద్దు అంటే తెలంగాణ ప్రాంతంలో సమాధి కడతారన్న ఆందోళన ఈ పార్టీలను వేధిస్తున్నాయి.

తమ నెత్తిపై కత్తి వలె వేలాడుతున్న ఈ సమస్యను కాంగ్రెస్ నెత్తిపైకి నెట్టి తప్పించుకోవాలని తెలుగుదేశం అధినేత చంద్రబాబు నాయుడు అఖిల పక్ష సమావేశం ప్రతిపాదన చేశాడు. ఇప్పటివరకు కాంగ్రెస్ పార్టీ అధికారికంగా తెలంగాణపై తన అభిమతాన్ని వెల్లడి చేయలేదు. కేంద్ర ప్రభుత్వం తరఫున సమావేశంపెడితే తమ వైఖరి ఎటూ తేల్చి చెప్పక తప్పని పరిస్థితి ఏర్పడుతుందని, ఆ ఇరకాటం తప్పించుకోవడానికైనా వారు సమావేశం పెట్టకుండా నానుస్తారని, అప్పటివరకు తనకు ఉపశమనం లభిస్తుందని ఆశపడ్డాడు చంద్రబాబు. అయితే తెలంగాణ కాంగ్రెస్ ఎమ్పీల పుణ్యమా అని ఆ పుణ్యకాలం అనుకొన్న దానికంటే ముందుగానే వచ్చేసింది. ఇది మూడు పార్టీలకు ఇరకాటమే.

వైఎస్ జగన్ సమైక్యవాది అన్నది అందరికీ తెలిసిన నిజం. లోక్‌సభలో తెలంగాణకు వ్యతిరేకంగా ప్లేకార్డ్ పట్టుకొని మరీ తన ఉద్దేశ్యాన్ని వెల్లడి చేశారాయన. అయితే దానివల్ల తెలంగాణ ప్రాంతంలో పార్టీకి నష్టం జరుగుతుందన్న భయం ఇప్పుడు వేధిస్తున్నది. తెలంగాణలో సీట్లు రాకుండా కేవలం ఆంధ్ర, రాయలసీమ ప్రాంతంలో గెలుచుకొనే సీట్లతో ముఖ్యమంత్రి కుర్చీ సాధించుకోవడం జరగని పని. కనీసం పాతిక ముప్పై సీట్లయినా గెలుచుకోవాల్సి వస్తుంది. తెలంగాణ వద్దు అని తేల్చి చెప్తే అక్కడ ఒకటి రెండు సీట్లు కూడా రావు. ఒకవేళ అనుకూలంగా మాట్లాడితే, ఆంధ్రలో ఎంతో కొంత నష్టం వచ్చే ప్రమాదంతోపాటు, మడమ తిప్పని వంశమన్న పేరు చెడిపోయే ప్రమాదం ఏర్పడుతుంది. దానితో ఈ సమావేశానికి తమను పిలవకుంటే బాగుండునని ఏసు ప్రభువుకు మొక్కుతున్నాడు జగన్.

తెలుగుదేశం దుర్గతి అంతకంటే తక్కువేమీ కాదు. తెలంగాణలో ఇప్పుడిప్పుడే కొంచెం పరిస్థితి అనుకూలంగా మారుతున్నదనుకొనే సమయంలో ఆ ప్రాంతం ప్రజల ఆకాంక్షలకు విరుద్ధంగా మాట్లాడే సాహసం చంద్రబాబు చేయలేడు. అయితే అనుకూలంగా ఒక్క మాట మాట్లాడినా ఆ సాకు చూపించి పార్టీ వదలి వెళ్లిపోవడానికి ఆంధ్ర, రాయలసీమ ప్రాంతాలలో చాలామంది ఎమ్మెల్యేలు కాచుకొని వున్నారు. వారి మనసు జగన్‌తో, శరీరం చంద్రబాబుతో వున్నాయిప్పుడు.

కాంగ్రెస్‌కు కూడా సమస్యే. ఇప్పటి వరకు అందరి వద్దా లేఖలు తీసుకొని, అందరితో సమావేశాలు పెట్టి తాను మాత్రం అభిమతం చెప్పకుండా కాలయాపన చేస్తున్నది ఆ పార్టీ. ఎన్నికల సమయంలో ఒక మాట ఆ తర్వాత వేరొక మాటగా మాయ చేస్తున్నది. ఆ అయోమయం వదలిపెట్టి ఏదో ఒకటి తేల్చి చెప్పక తప్పని పరిస్థితి వచ్చింది ఇప్పుడు. తెలంగాణ వద్దు అంటే, ఆ ప్రాంతానికి చెందిన ఆరుగురు ఎమ్పీలు టిఆర్ఎస్‌తో, ఇద్దరు ఎమ్పీలు జగన్‌తో కలిసి పోవడానికి సిద్ధంగా వున్నారు. తెలంగాణ మొత్తం మీద కాంగ్రెస్ పార్టీకి చిరునామా కూడా మిగలకుండా పోయే ప్రమాదం వుంది. కానీ తెలంగాణ ఇవ్వాలని మాట్లాడితే ఈశాన్య రాష్ట్రాలలో, మహారాష్ట్రలో, పశ్చిమబెంగాల్‌లో సమస్యలు ఎదుర్కోవాలి. మొత్తానికి తెలంగాణ కాంగ్రెస్ ఎమ్పీలు అందరినీ ఇరకాటంలోకి నెట్టారు.

# ఐఏఎస్ అధికారులపై సుబ్బారెడ్డి ఇంద్రజాలం!

ప్రతిపక్షంలో వుంటూనే అధికార పక్షంతో సమానంగా పనులు చక్కబెట్టుకోవడంలో వైఎస్ఆర్ కాంగ్రెస్ నేతలు చాణక్య నీతిని పాటిస్తున్నారు. రేపటి ఎన్నికలలో అధికారంలోకి రాబోయేది తామే అన్న అభిప్రాయం కల్గించడం, దాన్ని విస్తృతంగా ప్రచారం చేస్తుండడంతో జిల్లాల స్థాయిలో అన్ని విభాగాల అధికారులూ వైఎస్ఆర్ కాంగ్రెస్ నేతలొస్తే లేచి నిలబడి మరీ మర్యాద చేస్తున్నారు. పోలీసు స్టేషన్లు, తహశీల్దారు ఆఫీసులు, కలెక్టరేట్ వంటి చోట్ల జగన్ పార్టీకి జరిగినంత మాత్రం పనులు కాంగ్రెస్ వాదులకు జరగడం లేదు.

ఇదియిట్లా వుంటే సెక్రటరియేట్ స్థాయిలో కూడా తమ మాట చెల్లించుకోవడానికి జగన్ పార్టీ ఇంద్రజాల విద్య ప్రదర్శిస్తున్నది. ఆ పార్టీ ముఖ్యుడు, జగన్ పినతండ్రి అయిన వైవి.సుబ్బారెడ్డి సీనియర్ ఐఎఎస్ అధికారులకు ఫోన్లు చేసి, మీరు మా పార్టీలోకి రండి, జగన్‌తో మాట్లాడి మీకు టిక్కెట్ ఇప్పిస్తాను అని ఆహ్వానిస్తున్నాడు. ఎస్సీ, ఎస్టీ వర్గానికి చెందిన ఐఎఎస్ అధికారుల మీద ఈ సమ్మోహనాస్త్రాన్ని అధికంగా ప్రయోగిస్తున్నాడాయన. రిటైర్‌మెంట్‌కు దగ్గరగా వుండే ఐఎఎస్, ఐపిఎస్‌లలో మరీ ముఖ్యంగా ఎస్సీ వర్గంలో రాజకీయ ఆసక్తి అధికంగా వుంటుంది. ఎమ్పీ సీటు అంటే వారికి ఎక్కడలేని మమకారం. ఆ బలహీనతను వాడుకోవడంలో వైవి సుబ్బారెడ్డి తన నేర్పరితనమంతా ప్రదర్శిస్తున్నాడు. రేపటి ఎన్నికలలో జగన్ టిక్కెట్ దొరికితే చాలు గెలిచినట్లే అన్న భావన వుండడంతో, ఐఎఎస్ అధికారులు ఆయన వలలో చిక్కుక పోతున్నారు. ఫలానా నియోజకవర్గానికి మీరైతేనే బాగుంటుంది. మీరు సరే అంటే జగన్‌తో మాట్లాడతా అని పిలుస్తున్నాడాయన. దానితో ఆ అధికారులు రాజకీయ పల్లకీలో వూరేగుతున్నట్లే పగటి కలలు కంటున్నారు. వారా మైకంలో మునిగి తేలుతున్నప్పుడు, చల్లగా తనకు కావాల్సిన పనుల చిట్టా అందిస్తున్నాడు సుబ్బారెడ్డి. అధికారంలో లేకపోయినా అధికార పార్టీతో సమానంగా పనులు చక్కబెట్టుకోగలుగుతున్నాడు.

